శుభమస్తు.

శ్రీజగద్గురువిశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి.

అయిదవభాగము.

—:0:—

శ్రీదత్తాత్రేయమహర్షిచే రచియింపఁబడిన

## అవధూతగీత - అచలము.

ఇది

రాజమండ్రి వాసస్థుఁడగు

పట్టిసపు - వెంకటేశ్వరునిచే,

ఆంధ్రతాత్పర్యము వ్రాయఁబడి

రాజమండ్రి వాసస్థులగు

చెల్లూరి - రామశాస్త్రి రాజయోగిగారిచేతను,

వెంటపాకు వాసస్థులు

వింజమూరి-వీరరాఘవాచార్యులుగారిచేతను

లేఖక ప్రమదాది జనితదోషంబులు లేకుండునటుల పరిష్కరింపఁబడి

చెన్నపురి:

స్టార్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

 1905. [Price 10 Annas.

శుభమస్తు.

శ్రీజగద్గురువిశ్వనాధావధూతయేనమః.

# విజ్ఞాపన.

ఓ సుహృదయులారా!

ఆగ్రహించక నాప్రార్థన సంపూర్ణముగ వినగోరెద.

సీ॥ ఆత్మవృత్తుల నెడియంబుధులింకునే యచలాత్మయనుబడబాగ్ని
లేక । వికటాష్టమదశైలనికరముల్ పగులునే ధరణినిశ్చలవజ్ర
ధార లేక। యీషణాత్రితయమత్తేభంబులడగునే పరిపూర్ణమనెడు
కేసరియు లేక। మేను నేననుగాఢమేఘంబువిచ్చునే శేషాత్మయను
వాయుసిద్ధి లేక । పరమపదనిర్గుణానంతనిరుపమాన వస్తువీక్షింప
గల్గునే వర్గరహిత। సలలితానందగురుకృపాంజనము లేక హరిహర
విధాతృలకైన నరశిచూడ॥

సీ॥ ధరణిసంసారసంతాపార్తి దీరునే గురుదాస్యమనుహిమకరుడు లేక
మదవృత్తియను పెద్దమత్తేభమణగునే దేశికార్చమృగాధిపుడు
లేక। శత్రుషట్కాభీలసర్పంబులడగునే గురుకృపయనుఖగేశ్వ
రుడు లేక। మమతభావంబను హిమమెల్లదొలగునే దేశికధ్యానా
ర్కదీప్తి లేక। పరమ పద నిర్గుణానంత నిరుపమాన వస్తువీక్షింప
గల్గునే వర్గరహిత। సలలితానందగురుకృపాంజనము లేక । హరిహర
విధాతృలకునైన నరశిచూడ॥

సీ॥ దుర్గ్రహశ్యరూపపంక్తి శిరుందుగూల్చునే బయలనుజానకీభర్త లేక ।
అభిమానమను గంభీరాంబువ్రులింకునే పరమపతార్కశిగ్రరుచి లేక
సత్యానృతాభీలసర్పంబులడగునే పరమాత్మయనుఘోరబర్హి
లేక। చైతన్యమనెడుజీమూతోంబువిరియునే సత్యాత్మయనుప్రభు
జనము లేక। పరమపదనిర్గుణానంతనిరుపమాన వస్తువీక్షింపగల్గునే
వర్గరహిత । సలలితానందగురుకృపాంజనము లేక హరిహరవిధా
తృలకునైన నరశిచూడ॥

అని జెప్పియున్నది. గనుక సద్గురుచరణంబులకై వెదకి వెదకి చతుర్విధ శిశ్రూషలంజేసి వారి కరుణను బొంది క్రమాభ్యాసంబున సాంఖ్య తారకామనస్కాచల భావములను గురు కరుణచే దెలసుకొని జీవన్ముక్తులై యుండుటయే మనుజజన్మకు సాఫల్యము. అట్టి సంగతిలో ముప్పాతిక మందిజనులు అవిద్యా విశేషంబున మాయలోబడి యుండిరి. ఎవరేని వారి యదృష్టవశముచేత గురుకరుణకు పాత్రులైనచో వారిని ప్రాకృతులుజూచి "వేదాంతము నేర్చుకొను వానికి మతిబోయి సంసారమును వదలివేసి సన్యసించును" అను అడసామితను సార్థకమునకు దెచ్చుటకై ప్రయత్నింతురు. తాముతరించుటనున్నదైయుండగా నెవరైన గురు పాదమును బట్టినచో ప్రాకృతులెల్లరుజేరి వానికి పూర్వము మతిబోకున్నను యిప్పుడు మతిబోవునట్లు చేతురు. ఎట్లనగా! మీరు పెద్దవేదాంతి అయినాడండీ? వేదాంతములోజేరి వెధవలకే పొందుచున్నాడండి? సంసారికి వేదాంతమెందుకు. భార్యాపిల్లలతో సుఖముగావుండి నాలుగు డబ్బులు పోగుజేసుకొనక వీనికి వేదాంతమెందుకో? వీరు ఆఖరునకు సంసారమును వదలివేసి బైరాగియగును. అను మొదలగు సంగతులు వీని జెవులం బడగానే నదివరకు బైరాగికాకున్నను అద్వైతవాసనగలుగుటచే దీనిని వదలలేక, ఆఖరునకు బైరాగియే యగును. ఆతండెట్లున్నను కొరతలేదుగాని ప్రాకృతులు మాత్రము పాపమును మూటగట్టుకొనుచున్నారు. వేదాంతమందు సంసారములో వుండగూడదనియు, సన్యసించమనియు, లేదు. సద్గురుమూర్తి దొరకక భావంబుచెడి బైరాగులుగ గొందరగుచుండిరి. అందు మా కూటంబు సంగతియే కొంత వ్రాసెద. శ్రీజగద్గురు విశ్వనాథావధూత వారికి రెడ్డి వెంకట సుబ్రహ్మణ్యముగారును, తణికెళ్ల లత్సయ్యగారి కుమారుడు శేషయ్య గారును, మంతిన వెంకటరత్నము గారును, నేనును, యింకాయితరులును శిష్యులు గలరు. మాలో మంతిన వెంకటరత్నముగారు తానుతారక దీక్షనుపొంది మరికొంత కాలంబునకే మృతిజెందిరి. ఆయన శిష్యుండును ప్రస్తుతంబున కలినిబాపుచుండిన మహానుభావుండై కలిజనులలో ఖ్యాతిబొందిన నాతండును, అగుయడ్ల రామదాసుగారొక హరికధను అచ్చు వేయించినారు. పూర్వము ఏ మహానుభావుండైనను హరికధను రచించినచో హరిశ్చంద్రోపాఖ్యానమనియో, కుచేలోపాఖ్యానమనియో, యేదో ఒక పేరు

పెట్టి వారలుతరించిన సంగతియంతయు వ్రాశిరి. ఈ రామదాసుగారైతేనో "యడ్ల రామదాసుని హరికథ" యనియే పేరుపెట్టి గ్రంధమును రచించి స్వచ్ఛోత్తింపించిరి తన్ను తామెచ్చుకొనిన నెట్లుండునో నందరకుదెల్లమేకదా? ఆగ్రంథంబునందే శ్రీమోహానందులవారి శిష్యులు విశ్వనాధావధూతవారును, వారిశిష్యులు మంతిన వెంకట రత్నముగారును, వెంకటాచార్యులుగారి శిష్యులు తామని వ్రాశిరి. విశ్వనాధావధూతవారిగురువులు శ్రీశంకరానందులవారుగాని మోహానందులవారుగారు. గురుపరంపరయే దెలియదనియిందులోనే దెలసినదిగదా? మంతిన వెంకట రత్నముగారు తారకులై యుంటుండగా ఆయనకు తెలియని అమనస్కబోధయు నచలబోధయు యీ రామదాసుగారి కెట్లుదెలసెనో తెలియదు. ఇట్టిగురువు లందరును బయలుదేరుట చేతనే కలియందు వేదాంతు లెక్కువయిరి. తనతరింపులేని తత్పురుషుల పాదంబులంబట్టిన మహానుభావు లెంతతరింతురో పెద్దలకు విశదమేగదా? ఇటుల వేదాంతమంతయు వెదజల్లియుండుటచే వేరులేని మొక్కమొలచిన దన్నట్లున్నది. గాన వేదాంతమనన్నట్టిదో గ్రహించి అశరీరుల గనుంగొని వారిపాదంబులంబట్టి తరించు ప్రాకృతులకును, అచలమెట్టిదియో నెరుంగక పొట్టకూటికై శిష్యులంజేర్చు గురువులకును, అట్టివారి శిష్యులకును, యితర పామర జనులకును, సులభముగ బోధయగునటుల మహాపెద్దలచే వ్రాయబడిన గ్రంధంబులు జేర్చి ముద్రింపించితిని. గాన శ్లో॥ శిలాభావం పరిత్యక్త్వా శివభావంచకారయేత్ । శివభావం పరిత్యక్త్వా ఆత్మభావంచకారయేత్ । ఆత్మభావం పరిత్యక్త్వా అచలభావంచకారయేత్ । ఏవం విజ్ఞాన సంప్రాప్తేసర్వో ముక్తిర్న సంశయః॥ అనువచన ప్రకారము ముక్తిని బొందుటకై ప్రయత్నించి నాయుద్యమమ్మును గొనసాగింప ప్రార్థించెద. ఒకవేళమీరు దీనికి ద్రవ్యాపేక్షచే నిట్లుజేయుచున్నాడని యనుకొనెదరేమో? అదిగాదు. గ్రంథంబులన్నియు వెల్లడియైనచో బహుక్లేశ మూలకంబగు సంసారంబు మరల గలుగకుండ పామరులెల్ల జేసుకొనెదరను ఊహయేగాని ద్రవ్యార్జనకైగాదు. వేదాంతముపదేశమయినచో మరల సంసారంబు గలుగదనుటకు సాక్ష్యమేమందురేమో? అందుకే శ్లో॥ స్నానం తే సమస్తతీర్థసలిలే సర్వాపిదత్తావనిః। యజ్ఞానాంచ సహస్రమిష్టమఖిలా దేహీశ్చ సంతర్పితాః । సంసారాశ్చ సముద్ధృతాస్స్వపితర

త్రైలోక్యపూజ్యో ప్యయం। యస్య బ్రహ్మ విచారణేక్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥ కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ యేన। అపారసంవిత్సుఖసాగరే స్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః॥ అని పెద్దలు చెప్పియున్నారు. గురు వాక్యము, శాస్త్రదృష్టాంతరము, అనుభవము, మూడును సరిపోవలెను గదా. ఈ శ్లోకార్థమటుల సరిపోవుచున్నది. గాన నా యుద్యమమును నెరవేర్ప నెల్లరు ప్రయత్నింతురు గాక. ఈ పుస్తకమునకు ఖరీదు రు. 6-0-0 లు అయితే గురుపుత్రులు కొనలేమనియు సాంఖ్యతారక మనస్కయచలములను విడదీసి భాగములుగ ముద్రింపించుమనియు గోరుటచే నాలుగు బుక్కులుగా విడదీసి వేరు వేరు ధరలనుంచితి.

వేదాంత గ్రంథము లనేకముగా ననుభవముగా వ్రాయబడినవి యున్నవి. మనవిద్యను వృద్ధిచేయ దలచినచో నామొరాలింపుడు. ప్రతి గ్రంథమును బూర్తిగ నచ్చొత్తించి ప్రకటించుటకై ద్రవ్య సహాయముగావలెను. అందుచే ఈగ్రంథములన్నియు నెలకు 40 పుటలవంతున ప్రతి కారూపముగా ప్రకటింప దలచితిని. గురుపుత్రులందరును నాయుద్యమమును నెరవేర్ప బ్రయత్నించి చందాదారులుగ జేరుదురని దలచెద. గురుపుత్రులకు ఒక రోజున కూటమునకై యగుఖర్చంతయైనను చందా యేర్పరచలేదు. గ్రంథములన్నియు వెల్లడియగును. చందా సంవత్సరమునకు పోస్టేజితో 3-0-0లు మాత్రమే. సాలునకు రమారమి 500 పేజీల గ్రంథములగును.

ఇట్లు,

 పట్టిసపు-వెంకటేశ్వరుడు.

శుభమస్తు.

శ్రీజగద్గురు విశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి.

అయిదవభాగము-అచలము.

ఆంధ్రతాత్పర్యసహిత

## అవధూతగీత.

### అథప్రథమోఽధ్యాయః.

శ్రీదత్త ఉవాచ.

శ్లో॥ ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా।
మహద్భయపరిత్రాణా ద్విప్రాణాముపజాయతే॥

అవతారిక॥ శ్రీదత్తాత్రేయ మహర్షి యాదవాచలంబుననుండి తపంబుచేయుచుండఁగని, స్వామి కార్తికుండను నవధూతవచ్చి నమస్కరించి యోస్వామీ! నాకు అద్వైతవిధిని, సమగ్రముగా నానతీయ వలయునని యడుగఁగా దత్తాత్రేయుండను విష్ణ్వంశ సంభూతుండు అవధూతయగు స్వామి కార్తికునకు జెప్పినవిధంబు నీగ్రంథరూపముగా లోకమున ప్రసిద్ధంబయినది.

తా॥ దత్తాత్రేయులు చెప్పుచున్నారు. ఓయవధూతా! వినుము. లోకములో మనుజులకు ఈశ్వరానుగ్రహము గలిగినంగాని యద్వైతవాసన కలుగదు. ఈశ్వరుఁ డను గ్రహించిన యెడల నద్వైతసిద్ధిగలుగును. గొప్పదైన సంసార భయమునుండి రక్షించుట వలన విప్రోత్తములకు నద్వైత వాసన గలుగును.

అవధూత ఉవాచ.

యేనేదంపూరితంసర్వ మాత్మనైవాత్మనాత్మని
నిరాకారంకథంవన్దే హ్యభిన్నంశివమవ్యయమ్॥

తా॥ అవధూత చెప్పుచున్నారు. ఈ జగంబంతయు నెవ్వఁడు పరమాత్మచేతను తానే యుపకరణముచేత తనయందే నింపఁబడినదో అట్టి సర్వము తానై [illegible]

దూరంగానట్టియు, నాశన రహితుఁడైనట్టియు, నిరాకారుఁడగు పరమాత్మను ఏవిధముగా నమస్కరింతును. నమస్కరించు విధము నానతీయ వలయునని భావము.

పంచభూతాత్మకంవిశ్వం మరీచీజలసన్నిభమ్
కస్యాప్యహోనమస్కుర్యా మహమేకో నిరంజనమ్॥

తా॥ జగత్తంతయు పంచభూత మయమయినదియు, ఎండమావులయందలి జలమువలె భ్రమాత్మకమైనదియు, ఒకఁడనేయయియుండి నిరంజనుఁడనైన నేను ఎవనికి నమస్కారము చేయుదును? సర్వము నేనైనప్పుడు నమస్కార మెవ్వనికి చేయుదును?

ఆత్మైవకేవలంసర్వం భేదాభేదోనవిద్యతే
అస్తినాస్తికథంబ్రుయాం విస్మయఃప్రతిభాతిమే॥

తా॥ మఱియు ఓస్వామీ! సమస్తమైన దృశ్యప్రపంచము కేవలము ఆత్మయే గాని వేఱొకటిలేదు. భేదముగాని అభేదముగాని లేదు. ఉన్నదని గాని లేదని గాని యేలాగున చెప్పుదును? ఈవిషయమై నాకు మిక్కిలి విస్మయము కలుగుచున్నది.

వేదాన్తసారసర్వస్వం జ్ఞానవిజ్ఞానమేవచ
అహమాత్మానిరాకార స్సర్వవ్యాపీస్వభావతః॥

తా॥ వేదాంతసారము యొక్క సర్వము నేనే అయితిని. జ్ఞానము విజ్ఞానమును నేనే యైతిని. సర్వవ్యాపినై స్వభావమువలన నిరాకారుఁడైన నేనే పరమాత్మనయి యుంటిని.

యోవైసర్వాత్మకోదేవో నిష్కలో గగనోపమః॥
స్వభావనిర్మలశ్శుద్ధ స్సఏవాహంనసంశయః॥

తా॥ ఎవఁడు సర్వాత్మకుఁడైన దేవుఁడో, నిష్కలంకుఁడై గగనముతో సమానుఁడో, స్వభావనిర్మలుఁడై శుద్ధుఁడై ఎవఁడుండునో, అట్టి పరమాత్మ నిస్సంశయముగా నేనే యయి యున్నాను.

అహమేవావ్యయోఽనన్త శుద్ధవిజ్ఞానవిగ్రహః
సుఖందుఃఖంనజానామి కథంకస్యాపివర్తతే

తా॥ నాశములేక యపరిచ్ఛేదుఁడై కేవలజ్ఞానమే స్వరూపము కలిగిన వాఁడను నేనే గాని పరమాత్మకంటె భిన్నుఁడను కాను. నేను సుఖమును దుఃఖమును తెలుఁగను. ఎవరికయిన నవి యేట్లుగానుండును? ఉండనేరవని నా తాత్పర్యము.

నమానసంకర్మశుభాశుభంమే నకాయికంకర్మశుభాశుభంమే
నవాచికంకర్మశుభాశుభంమే జ్ఞానామృతంశుద్ధమతీంద్రియోఽహమ్॥

తా॥ నాయొక్క మానసిక కర్మయేదియు శుభాశుభములు గలదియైయుండదు. నా శారీరక కర్మయేదియు శుభాశుభములు గలదియై యుండ లేదు. నా యొక్క వాచిక సంబంధమయిన యే కార్యము శుభాశుభములు గలదికాదు. అతీంద్రియుఁడనైన నేనుజ్ఞానానంద స్వరూపుఁడనైన శుద్ధపర బ్రహ్మస్వరూపుఁడను.

మనోవైగగనాకారం మనోవైసర్వతోముఖమ్
మనోఽతీతంమనస్సర్వం నమనఃపరమార్థతః॥

తా॥ మనస్సు గగనసదృశమైనది. మనస్సే సర్వత్ర వ్యాపించునది. మనస్సును అతిక్రమించినది మనస్సు. (ఈరెండవ మనశ్శబ్దము పరబ్రహ్మార్థకము. మొదటి మన శ్శబ్దము మానసార్థకము.) పరమార్థమువలన మానసమేలేదు.

అహమేకమిదంసర్వం వ్యోమాతీతంనిరన్తరమ్॥
పశ్యామికథమాత్మానం ప్రత్యక్షంవాతిరోహితమ్॥

తా॥ నేను ఒక్కఁడనే, వ్యోమాతీతమై సర్వవ్యాపియై అంతర్బహిర్భావములు లేక యుండెడి యీజగంబంతయు నేనే అయియుండఁగా ప్రత్యక్షముగా నున్నట్టిగాని తిరోహితుఁడైనట్టిగాని ఆత్మను ఎట్లుగా చూచుచున్నాను. చెప్పవలయును.

త్వమేవమేకంహికథంనబుధ్యసే సమంహిసర్వేషువిమృష్టమవ్యయమ్
సదోదితోఽసిత్వమఖండితఃప్రభో దివాచనక్తంచకథంహిమన్యసే॥

తా॥ ఓ దత్తాత్రేయ ప్రభూ! నీవు సమానముగా సర్వలోకములయందు విడిపింపఁబడి నాశనరహితమైన యద్వైత పరబ్రహ్మను ఎట్లుగా తెలియక నున్నావు. నీవు అఖండితమైన విక్రమము గలవాఁడవై ఎల్లప్పుడుదయించుచున్నావు. పగలు అని రాత్రి అని అనునట్టివానిని ఏమిగా తలంచుచున్నావు.

శ్రీదత్తఉవాచ.

అత్మానంసతతంవిద్ధి సర్వత్రైకంనిరన్తరమ్
అహంధ్యాతాపరంధ్యేయ మఖణ్డంఖణ్డ్యతేకథమ్॥

తా॥ దత్తాత్రేయుఁడు చెప్పుచున్నాఁడు. ఓయి యవధూతా! నిన్ను నిరంతరునిగా నెఱుంగుము. సర్వప్రదేశములయందును, నద్వితీయుఁడై జగద్వ్యాప్తుండై యున్నాఁడని యాత్మను దెలిసికొమ్ము. నేను ధ్యానము చేయువాఁడను. ధ్యేయుఁడనై (ధ్యానింపఁదగిన పరతత్వమను) యున్నాను. అఖండమయిన వస్తువు ఎప్పుడు ఏవిధముగా ఖండింపఁబడదని భావము.

నజాతోనమృతోఽసిత్వం నతేదేహఃకదాచన
సర్వంబ్రహ్మేతివిఖ్యాతం బ్రవీతిబహుధాశ్రుతిః॥

తా॥ నీవుపుట్టుటయూలేదు. చావనూ చావవు. నీకెన్నడును దేహమూలేదు. సర్వం బ్రహ్మ అని అంతయు బ్రహ్మయే. అని ప్రసిద్ధముగా శ్రుతి అనేకవిధములజెప్పుచున్నది.

నబాహ్యాభ్యంతరోఽసిత్వం శివస్సర్వత్రసర్వదా
ఇతస్తతఃకథంభ్రాన్తః ప్రధావసిపిశాచవత్॥

తా॥ నీవు బాహ్యమునందు నంతరంబు నను గలిగియున్నావు. మఱియు నెల్లప్పుడెల్ల ప్రదేశములందును సచ్చిదానందమూర్తివి. భ్రాంతిగలవాడవై పిశాచమువలె ఇటునటు నానా ప్రదేశములయందేల తిరుగుచున్నావు. ఆతిరుగుటయెల్ల వ్యర్థమని తాత్పర్యము. (అవధూతలు నిలుకడలేక సర్వప్రదేశముల నెల్లప్పుడు తిరుగుచుండుట మర్యాదయై యున్నది. గాని నిపుడు దత్తాత్రేయులు దూషించిరి.)

సంయోగశ్చవియోగశ్చ వర్తతేనచతేనమే
నత్వంనాహంజగన్నేదం సర్వమాత్మైవకేవలమ్॥

తా॥ నాకు గాని నీకు గాని సంయోగము లేదు. వియోగములేదు. నీవు లేవు. నేను లేను. జగత్తు లేదు. ఇకను సర్వము ఆత్మయొకటి మాత్రమే నిశ్చయము.

శబ్దాదిపంచకస్యాస్య నైవాసిత్వంనతేపునః
త్వమేవపరమంతత్వ మతఃకింపరితప్యసే॥

తా॥ శబ్ద స్పర్శ రస రూప గంధములనెడి యీ యయిదు విషయములకును నీవు గోచరుడవు కావు. నీకా శబ్దాదులును గోచరములు కావు. నీవు వానియందభిలాష లేక సంచరించెదవు. కావున నీవే పరమ తత్వమవైయున్నావు. ఎందువలన నీవు పరితపించుచున్నావు? పరితపింప నవసరము లేదని భావము.

జన్మమృత్యుర్నతేచిత్తం బన్ధమోక్షౌశుభాశుభౌ
కథంరోదిషిరేవత్స నామరూపంనతేనమే॥

తా॥ ఓవత్సా! ఎందు నిమిత్తమ్ము రోదనము చేసెదవు. ఊరడుము. నీకు జన్మములేదు. మృత్యువులేదు. నీకు చిత్తము లేదు. బంధము లేదు. మోక్షము లేదు. శుభాశుభములు లేవు. నామము లేదు. రూపము లేదు. నాకును లేదు. నీకును లేదు. రోదనమునకు కారణమేమి. నీవు పరిశుద్ధుడవైన ప్రత్యగాత్మవైతివి.

అహోచిత్త కథంభ్రాన్తః ప్రధావసి పిశాచవత్।
అభిన్నం పశ్యచాత్మానం రాగత్యాగాత్సుఖీభవ॥

తా॥ ఏమి యాశ్చర్యమిది? చిత్తస్వరూపుఁడా! ఎందువలన భ్రమపడి పిశాచవు లాగున నూరక తిరిగెదవు? నీవు ఆత్మను అభిన్నునిగా దలంచుము. రాగద్వేషాదులను వదలివేయుము. అటుల వదలిన కారణమున సుఖవంతుఁడవు కాదలపుము. కమ్ము.

త్వమేవతత్త్వంహి వికారవర్జితం
నిష్కమ్పమేకంహి విమోక్షవిగ్రహమ్
నతేచరాగో హ్యథవావిరాగః
కథంహిసంతప్యసికామకామతః॥

తా॥ నీవే వికారవర్జితుఁడవైన తత్వమవు. భయకంపములు లేక యద్వితీయమైన మోక్షస్వరూపమైన వాఁడవును నీవే. నీకు రాగముగాని విరాగముగాని లేవు. కామములనుకోరుటవలన నీ వెట్లు తపింపఁబడుదువు? తపింపఁబడవని భావము.

వదన్తి శ్రుతయ స్సర్వానిర్గుణం శుద్ధమవ్యయమ్।
అశరీరం సమంతత్వంతన్మాం విద్ధి నసంశయః॥

తా॥ సమస్త శ్రుతులును, పరతత్వమును నిర్గుణునిగాను, నాశరహితునిగాను, శరీర రహితునిగాను సమునిగాను జెప్పుచున్నవి. ఆ తత్వమును నన్నుగా నెఱుంగుము. సంశయములేదు.

సాకారమనృతం విద్ధి నిరాకారం నిరన్తరమ్।
ఏతత్తత్వో పదేశేన నపునర్భవ సంభవః॥

తా॥ సాకారమైనదంతయు నబద్ధమని తెలిసికొనుము. నిరాకారమయినది సర్వకాలముండునదిగా దెలిసికొనుము. ఈ తత్వోపదేశము చేతను నీకు పునరుత్పత్తి లేదు.. గావున నిస్సంశయముగ సుఖింపుము.

ఏకమేవసమంతత్త్వం వదన్తిహివిపశ్చితః।
రాగత్యాగా త్పునర్చిత్తమేకానేకంనవిద్యతే॥

తా॥ విద్వాంసులు తత్వమును సమముగాను ఒక్కటేయయినదిగాను చెప్పుదురు రాగాదులను విడచుట వలననైతే చిత్తము ఏకముగాను ననేకముగాను నుండదు.

(అవధూత ఉవాచ)

అనాత్మరూపంచ కథంసమాధిరాత్మ స్వరూపంచకథం సమాధిః।
అస్తీతినాస్తీతి కథం సమాధి ర్మోక్షస్వరూపంయది సర్వమేకమ్॥

తా॥ అవధూత చెప్పుచున్నాఁడు. అనాత్మరూపమని ఏలాగున నిశ్చయము? ఆత్మస్వరూపమిది యని యేలాగున నిశ్చయము? ఉన్నది అని లేదు అని యేలాగు నిశ్చయము?

ఇదియంతయు మోక్షస్వరూపమని యంటిరిగదా? మోక్ష స్వరూపమైన పక్షమున కెట్లు దీనిని గనుగొననగును?

విశుద్ధోఽసిసమంతత్వం విదేహ స్త్వమజోఽ వ్యయః।
జానామీహానజానామీ త్యాత్మానంమన్యసేకథమ్॥

తా॥ సర్వసమమైన తత్వము నీవయితివి. విశుద్ధుఁడవయితివి. విదేహుఁడవు. నవ్యయుండవై నజుఁడవైతివి, నేను తెలిసికొన్నాను. నేను ఎఱుఁగను అను దానిని ఆత్మనుగా నెట్లు దలఁప వచ్చును?

తత్వమస్యా దివాక్యేన స్వాత్మాహిప్రతి పాదితః।
నేతి నేతి శ్రుతిర్బ్రూయాదనృతం పాంచభౌతికమ్।
ఆత్మన్యే వాత్మనాసర్వం త్వయాపూర్ణం నిరన్తరమ్।
ధ్యాతాధ్యా నంన తే చిత్తంనిర్లజ్జం ధ్యాయ తే కథమ్॥

తా॥ «తత్వమసి» ఇత్యాది వాక్యములచేతను ఆత్మప్రతిపాదింపఁబడినది. «నేతి నేతి» అనెడు శ్రుతి పాంచభౌతికము ననృతముగా జెప్పచున్నది. ఆత్మయందే ఆత్మచేతను సర్వము నిరంతరముగ నీచేత పూరితమైయున్నది. నీకు ధ్యాతయులేదు. ధ్యానములేదు. చిత్తమైనాలేదు. లజ్జలేకుండా నేలాగున ధ్యానము చేయవచ్చును.

శివం నజానామికథంవదామిశివంనజానామి కథంభజామి।
అహంశివ శ్చే త్పరమార్థ తత్వంసమస్వ రూపంగగనో పమంచ॥

తా॥ శివునెఱుఁగను ఏలాగున చెప్పుదును? శివునెఱుఁగను. ఏలాగున భజనసేతును? ఆపరమార్థ తత్వమయిన శివుఁడను నేనైయున్నట్లులయితే సమస్వరూపుఁడను. ఆకాశ తుల్యుఁడ నయ్యెదను.

నాహంతత్త్వం సమతత్త్వం కల్పనా హేతు వర్జితమ్।
గ్రాహ్యగ్రాహక నిర్ముక్తం స్వసంవేద్యం కథంభ వేత్॥

తా॥ నేను తత్వమును కాను. సమమయిన తత్వమునుకాను. ఆతత్వము కల్పనా హేతువులులేనిది. (అవిద్యామాయోపాధులులేనిదని భావము) ఇట్టి పరతత్వము గ్రాహ్య గ్రాహక సంబంధములేని దయ్యెనేని స్వానుభవజ్ఞాన గోచర మెట్లులగును.

అనంత రూపంనహి వస్తుకించిత్తత్త్వ స్వరూపంనహి వస్తుకించిత్।
ఆత్మైకరూపం పరమార్థతత్త్వం నహింసకో వాపినచాప్యహింసా॥

తా॥ అనంతరూపమైన వస్తువెద్దియును లేదు. తత్వ స్వరూపమయిన వస్తువెద్దియును లేదు. పరమార్థమైన తత్వము ఆత్మైక్య రూపము. హింసగాని యహింసగాని యేమియును లేదు.

విశుద్ధోఽసి సమంతత్త్వం విదేహామజ మవ్యయమ్।
విభ్రమంకథ మాత్మార్థే విభ్రాన్తోఽహం కథంపునః॥

తా॥ సమస్త తత్త్వమును దెలిసిన విశుద్ధుఁడవైతివి. విదేహుఁడైయజుఁడై యవ్యయుఁడైన వాఁడవయితివి. ఆత్మ విషయమై విభ్రమమొందకు. ఎందువలన నెల్లప్పుడు విభ్రాంతి నొందుదును.

ఘటేభిన్నే ఘటాకాశం సులీనంభేద వర్జితమ్।
శివేన మనసా శుద్ధో నభేదఃప్రతి భాతిమే॥

తా॥ శివునిచేత, మనస్సుచేత శుద్ధమైనది కాగా భేదము నాకు గానంబడుటలేదు. ఘటము భిన్నముకాగా ఘటాకాశము మహాకాశమునందు భేదములేకనే లీనమైపోవును.

(శ్రీదత్తఉవాచ)

నఘటో నఘటాకాశో నజీవో జీవవిగ్రహః।
కేవలంబ్రహ్మసంవిద్ధి వేద్యావేదక వర్జితమ్॥

తా॥ శ్రీదత్తాత్రేయులు చెప్పుచున్నారు. ఘటమూలేదు. ఘటాకాశమూలేదు. జీవుఁడు లేడు. జీవ విగ్రహుఁడు లేడు. వేద్యవేదకములు లేక కేవలము బ్రహ్మయొక్కఁడే యున్నాఁడు. వేద్యవేదకములనఁగా తెలిసికొనదగిన వస్తువు తెలుసుకొను వాఁడునని యభిప్రాయము.

సర్వత్ర సర్వదాసర్వ మాత్మానం సతతం ధ్రువమ్।
సర్వంశూన్య మశూన్యంచతన్మాం విద్ధి నసంశయః॥

తా॥ సర్వప్రదేశములయందును నెల్లప్పుడు సర్వస్వరూపుఁడను గా, సర్వవ్యాపిగా శాశ్వతునిగా, శూన్య స్వరూపుఁడనుగా, నశూన్యస్వరూపుఁడనుగా నన్ను తెలిసికొనుము. సర్వము నేనైయున్నాఁడను. సంశయింపవలదు. "సర్వంఖల్విదంబ్రహ్మ" (ఈ కనపడు సర్వజగత్తున్ను బ్రహ్మయే కదా) అను శ్రుతి దీనికి విషయము.

వేదానలోకా నసురానయజ్ఞా వర్ణాశ్రమోనైవకులంనజాతిః।
నధూమ మార్గోనచ దీప్తిమార్గో బ్రహ్మైకరూపంపరమార్థతత్త్వమ్॥

తా॥ వేదములు లేవు. లోకములు లేవు. దేవతలు లేరు. యజ్ఞములు లేవు. వర్ణములులేవు. ఆశ్రమములులేవు. కులములేదు. జాతిలేదు. ధూమమార్గములేదు. దీప్తిమార్గము లేదు. (అర్చిరాదిమార్గము) పరమార్థరూపమైన బ్రహ్మమొకటియే యున్నది.

(అవధూత ఉవాచ)

వ్యాప్య వ్యాపక నిర్ముక్తంత్వమేక స్సఫలంయది
ప్రత్యక్షం చాపరోక్షంచ ఆత్మానం మన్యసేకథమ్॥

తా॥ అవధూత చెప్పుచున్నాఁడు. వ్యాప్యుఁడు, వ్యాపకుఁడు అనే భేదము లేని నీవొక్కఁడవే సఫలమయినట్టులయ్యేనేని ప్రత్యక్షమని, అపరోక్షమనియు, ఆత్మ నెట్లుగా తలచుచున్నావు.

అద్వైతంకే చిదిచ్ఛన్తిద్వైత మిచ్ఛన్తిచాపరే।
సమంతత్త్వం నవిన్దన్తిద్వైతాద్వైతవివర్జితమ్॥

తా॥ కొందఱు అద్వైతము నాపాదించు శ్రుతులంబట్టి అద్వైతమగు నీశ్వరుండే తత్వము నిజమనియు, మఱికొందఱు ద్వైతము నాపాదించు శ్రుతులంబట్టి జీవేశ్వరద్వయము నిత్యమనియు, దలంతురు. ద్వైతాద్వైతములను విడిచి సమమయిన తత్వము నెవ్వరును తెలిసికొనుట లేదు.

శ్వేతాది వర్ణరహితం శబ్దాదిగుణ వర్జితమ్।
కథయన్తి కథంతత్త్వం మనోవాచామ గోచరమ్॥

తా॥ శ్వేత నీల పీతారుణాది వర్ణములులేనిదియు శబ్ద స్పర్శాది గుణ సూన్యమైన దియు నయి మనస్సునకు, వాక్కులకు నిట్టిదని యూహించుటకును చెప్పుటకును గోచరిం పని తత్వము నేలాగున చెప్పుచున్నారు.

యదాఽనృతమిదం సర్వందేహాది గగనోపమమ్।
తదాహి బ్రహ్మసంవేత్తి న తేద్వైత పరం పరా॥

తా॥ ఆకాశతుల్యమయిన యీదేహాదిక మంతయు నబద్ధమైయుండునని యెప్పుడు తెలిసికొనునో అప్పుడే బ్రహ్మను తెలుసుకొనుచున్నాఁడు. నీకు జన్మపరంపర అనఁగా ద్వైతపరంపర లే నేలేదు.

పరేణ సహజాత్మాపిహ్య భిన్నః ప్రతి భాతిమే
వ్యోమాకారంతథైవైకం ధ్యాతాధ్యానంకథంభవేత్॥

తా॥ సహజమైన యాత్మయును పరమాత్మునితో నభిన్నుఁడై నాకు ప్రకాశించుచు న్నాఁడు. వ్యోమాకారమై అలాగునసే యొక్కఁడేయయిన తత్వము ధ్యాతయును, ధ్యానమును ఎట్లు [illegible]యును.

యత్కరోమియదశ్నామి యజ్జుహోమిదదామియత్।
ఏతత్సర్వం నమేకించి ద్విశుద్ధోఽహమజోఽవ్యయః॥

తా॥ దేనిని నేను చేయుచున్నా, దేనిని భక్షించుచున్నా, దేనిని హోమము చేయుచున్నా, ఏదానిని నిత్తునో, ఇదియంతయు నాకేమియును లేదు. నేను విశుద్ధుఁడను, అవ్యయుఁడనైయున్నాను.

(శ్రీదత్త ఉవాచ)

సర్వం జగద్విద్ధి నిరాకృతీదం సర్వంజగద్విద్ధి వికారహీనమ్।
సర్వం జగద్విద్ధి విశుద్ధదేహం సర్వంజగద్విద్ధి శివైకరూపమ్॥

దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ సర్వజగత్తున్ను నిరాకృతునిగా దెలసికొనుము సర్వజగత్తును వికారహీనమునుగా దెలసికొనుము. సర్వజగత్తును విశుద్ధదేహము గలదానినిగా నెఱుంగుము. సర్వజగత్తును పరం బ్రహ్మస్వరూపమైనదానినిగా దెలిసికొనుము.

(అవధూత ఉవాచ)

తత్త్వంత్వంహి నసందేహఃకింజానామ్యథవాపునః।
అసంవేద్యం స్వసంవేద్య మాత్మానం మన్యసే కథమ్॥

అవధూత జెప్పుచున్నాఁడు.

తా॥ అట్టి తత్త్వమవు నీవే. అందువిషయమై సందేహములేదు. ఏమి తెలుసుకొనుచున్నాను. అసంవేద్యమై, సుసంవేద్యమైయున్న ఆత్మనెట్లుగాఁ దలఁచుచున్నావు. (అసంవేద్యమనఁగాఁ దెలియశక్యముగానిది. సుసంవేద్యమనఁగా బాగా దెలిసికొనఁదగినది.)

మాయామాయా కథంతాత ఛాయాఛాయా నవిద్యతే।
తత్త్వమేక మిదంసర్వం వ్యోమాకారం నిరంజనమ్॥

తా॥ మాయ, అమాయ ఇవి ఏలాగుననున్నవి? ఛాయ, అచ్ఛాయయును ఎట్లు లేదు? ఈ పరిదృశ్యమానమయిన జగంబంతయు నొక్కటేతత్త్వమైయున్నది. ఇది ఆకాశమువంటిదియు, త్రిగుణరహితమైనదియునై యున్నది.

ఆదిమధ్యాన్త ముక్తోఽహం నబద్ధోఽహం కదాచన।
స్వభావ నిర్మలశ్శుద్ధ ఇతిమే నిశ్చితా మతిః॥

తా॥ నేను ఆది, మధ్యము, అంతములేనివాఁడను. నేనెన్నఁడును బద్ధుఁడనుకాను. స్వభావనిర్మలుఁడను, శుద్ధుఁడను. ఇట్లని నాయొక్క మనస్సు నిశ్చయముగల మతియై యున్నది.

మహదాది జగత్సర్వం నకించిత్ప్రతి భాతిమే
బ్రహ్మైవ కేవలం సర్వంకథం వర్ణాశ్రమ స్థితిః॥

తా॥ మహదాది జన్యమైన జగత్తంతయు నా కేమియు కనపడియుండుట లేదు. సమస్తము విచారింపఁగా కేవలము బ్రహ్మయొక్క టేయయి యుండఁగా వర్ణాశ్రమముల యొక్క స్థితి యేలాగున కలిగినది.

జానామిసర్వథాసర్వ మహమేకోనిరన్తరమ్।
నిరాలమ్బ మశూన్యంచ శూన్యం వ్యోమాది పంచకమ్॥

తా॥ సర్వవిధములచేతను బహిరంతర్వ్యాపియైన నిరాలంబమయిన యొకటైన తత్వమే శూన్యముగాక నిలుచునది. వ్యోమాదికమయిన భూతపంచకము శూన్యమయి యున్నది.

నషణ్డో నపుమాన్నస్త్రీ నబోధో నైవకల్పనా।
సానన్దోవా నిరానన్దమాత్మానం మన్యసేకథమ్॥

తా॥ నపుంసకుఁడుగాఁడు. పురుషుఁడుగాఁడు. స్త్రీకాదు. జ్ఞానముకాదు. కల్పన కాదు. సానందుఁడుకాఁడు. నిరానందుఁడుగాఁడు. ఇట్టి ఆత్మను నీవెట్లుగాదలంచెదవు.

షడఙ్గయోగాన్నతునైవ శుద్ధంమనో వినాశాన్నతునైవశుద్ధమ్
గురూపదేశాన్నతునైవశుద్ధంస్వయంచతత్త్వంస్వయమేవబుద్ధమ్॥

తా॥ షడంగయోగమువలననే శుద్ధమైనదికాదు. మనోవినాశమువలననే శుద్ధమైనదిగాదు. గురూపదేశమువలననే శుద్ధమైనదియుకాదు. తత్వము దానంతట యదియే జ్ఞానస్వరూపమైనదై యున్నది.

నహిపంచాత్మకో దేహోవిదేహోవర్తతేనహి
ఆత్మైవ కేవలం సర్వంతురీయంచ త్రయం కథమ్॥

తా॥ దేహము పంచభూతస్వరూపమైనది కాదు. విదేహము సయితమున్నదన్న మాటలేదు. సర్వము కేవలాత్మయేయైన పక్షమునకు జాగ్రత్స్వప్న సుషుప్తులును, తురీయమును నెట్లుగానుండును?

నబద్ధోనైవ ముక్తోఽహం నచాహంబ్రహ్మణఃపృథక్।
నకర్తానచభోక్తాహం వ్యాప్యవ్యాపక వర్జితః॥

తా॥ నేను బద్ధుఁడనుకాను. ముక్తుఁడనుకాను. నేను బ్రహ్మకంటె వేఱయినవాఁడను కాను. నేను కర్తనుగాను. భోక్తనుగాను. వ్యాప్యవ్యాపక వర్జితుఁడనైతిని. అనఁగా నాకంటె వ్యాపింపఁదగినవాఁడులేఁడు. వ్యాపకుఁడులేఁడు. నేనొక్కఁడనే సత్యుఁడను.

యథాజలంజలేన్యస్తంసలిలం భేదవర్జితమ్
ప్రకృతిం పురుషం తద్వదభిన్నం ప్రతిభాతి మే॥

తా॥ జలము జలమునందుంచిన జలము భేదములేక యున్నట్టుగా ప్రకృతినిన్ని పురుషునిన్ని అలాగే అభిన్నమైన-దానినిగా నేను దలంచుచున్నాను. నాకావిధముగా దోచుచున్నది.

యదినామ నముక్తోఽసి నబద్ధోఽసి కదాచన।
సాకారంచ నిరాకార మాత్మానం మన్యసే కథమ్॥

తా॥ నీవు ముక్తుఁడవు కానూకావు. ఎప్పటికి బద్ధుఁడవునుకావు. ఆత్మను సాకారముగాను, నిరాకారముగాను ఎట్లు దలంచుచున్నావు.

జానామి తే పరంరూపం ప్రత్యక్షంగగనోపమమ్।
యథాపరంహి రూపం యన్మరీచిజల సన్నిభమ్॥

తా॥ ఓ స్వామీ! నీయొక్క పరస్వరూపము ప్రత్యక్షముగా నాకాశతుల్యముగానున్నది. పరమైన రూపమేలాగున నుండునో యని విచారింపఁగా ఎండమావులలోని నీరువలె నుండునని యెంచవలయును.

(దత్త ఉవాచ)

నగురుర్నోపదేశశ్చనచోపాధిర్నమే క్రియా।
విదేహంగగనం విద్ధివిశుద్ధోఽహం స్వభావతః॥

దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ గురువు అక్కరలేదు. ఉపదేశమక్కరలేదు. ఉపాధియును లేదు. క్రియయును లేదు. విదేహమయిన పరతత్వమును గగనాకారమునుగా దెలిసికొనుము. నేను స్వభావముచలననే పరిశుద్ధుఁడను.

విశుద్ధోఽస్యశరీరోఽసి నతేచిత్తం పరాత్పరమ్।
అహంచాత్మా పరంతత్వ మితివక్తుం నలజ్జసే॥

తా॥ విశుద్ధుఁడవయియుంటివి. అశరీరుఁడవైయుంటివి. నీకు చిత్తములేదు. పరునికంటె పరమైనవాఁడవు. నేనే ఆత్మను. పరతత్వమును. ఇట్లని చెప్పుటకు లజ్జింపవు.

కథంరోదిషి రేచిత్త హ్యాత్మైవాత్మాత్మనాభవ
పిబవత్స కలాతీ తమద్వైతం పరమామృతమ్॥

తా॥ ఓ చిత్తమా! నీవెందుకు రోదనము చేయుచున్న దానవు. నీవు నీ [illegible] ఆత్మవేకావున ఆత్మరూపుఁడవు కమ్ము. వికారాతీతమయిన అద్వైతపరామృతము [illegible]

త్తమమయిన యమృతమును పానముచేయుమా! వత్సా! ఇంతకంటె వేఱొక్కటి నీ కెద్దియునులేదు.

నైవబోధోనచాబోధోనబోధాబోధ ఏవచ।
యస్యేదృశస్సదాబోధస్సబోధోన్యాన్యథా భవేత్॥

తా॥ బోధయనునదియు లేదు. అబోధ యనునదియు లేదు. బోధాబోధయును లేదు.* (అనిర్వాచ్యశక్తిగల యవిద్యయనుట.) ఎవనికీలాగంటిబోధ సర్వకాలములయందుం డునో ఆబోధ యన్యథాగాకాక ఆత్మబోధానందమునే యనుభవింపఁజేయును.

జ్ఞానంనతర్కోన సమాధియోగో నదేశకాలౌన గురూపదేశః।
స్వభావసంవిత్తిరహం చతత్త్వమాకాశకల్పం సహజంధ్రువంచ॥

తా॥ జ్ఞానములేదు. తర్కములేదు. సమాధియోగములేదు. దేశములేదు. కాలము లేదు. గురూపదేశములేదు. స్వభావజ్ఞానములేదు. నేనేతత్వమును. ఆకాశసదృశమై సహజమై శాశ్వతమైన పరతత్వమును నేగాని అంతకంటె మఱొకటి మరేదియు లేదని భావము.

అవధూత ఉవాచ.

నజాతోఽహంమృతోవాపి నమేకర్మ శుభాశుభమ్
విశుద్ధనిర్గుణంబ్రహ్మబంధోముక్తిః కథంమమ॥

తా॥ అవధూతచెప్పుచున్నాఁడు. నేనుపుట్టనూలేదు. మృతిబొందనూలేదు. నాకు శుభాశుభకర్మలెవ్వియునులేవు. విశుద్ధుఁడనై నిర్గుణుఁడనైన నాకు బంధమను నదియు, ముక్తియనునదియు నాకేలాగున సంభవించును.

యది సర్వగతోదేవస్థ్సిరః పూర్ణోనిరన్తరః
అన్తరంహినపశ్యామి సబాహ్యాభ్యన్తరఃకథమ్॥

తా॥ దేవుఁడు సర్వగతుఁడాయెనా స్థిరుఁడై పూర్ణుఁడై నిరంతర వ్యాపియై యున్నాఁడు. అతఁడులేని యంతరము నెందునుగానకున్నాను. అయన బాహ్యాంతరములు కలవాఁడని యేలాగున ననవచ్చునో చెప్పుము.

స్ఫురత్యేవ జగత్కృత్స్నమఖణ్డిత నిరన్తరమ్
అహోమాయా మహామోహాద్వైతాద్వైత వికల్పనా॥

తా॥ సమస్తమయిన జగత్తును ప్రకాశించుచునే యున్నది. కొట్టివేయఁబడని నైరంతర్యము గలిగియున్నది. (అనఁగా నెప్పుడు నెడతెగక కలుగనే గలుగుచున్నదని భావము.) ఏమియాశ్చర్యముకీ మాయయనెడు మహాభ్రమద్వైతాద్వైతములని సంశయము కలుగ చేయుచున్నది. ఆశ్చర్యము.

శ్రీదత్త ఉవాచ.

సాకారంచ నిరాకారం నేతినేతీతి సర్వదా
భేదాభేద వినిర్ముక్తో వర్తతే కేవలశ్శివః॥

తా॥ దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు. సాకారమని, నిరాకారమని చెప్పంబడు నట్టి పరబ్రహ్మము ఎల్లప్పుడు "నేతి-నేతి" (లేదులేదని) వేదమునందు జెప్పఁబడుచున్నది. లేదులేదు అను వాక్యములకు భేదాభేదములు లేవని యన్వయింప వలయును. ఇపుఁడు కేవలుఁడైన పరమ శివుఁడు భేదాభేదములు లేక యున్నాఁడు.

నతేచమాతాచ పితాచ బంధుర్న తేచ పత్నీనసుతశ్చ మిత్రమ్
నపక్షపాతోన విపక్షపాతః కథంహిసంతప్తిరియంహిచిత్తే॥

తా॥ తల్లియులేదు. తండ్రియులేదు. బంధువులును నీకులేరు. నీకుపత్నియునులేదు, కుమారుఁడులేడు. స్నేహితుఁడునులేడు. పక్షపాతమూలేదు. విపక్షపాతమూలేదు. ఎందు వలన నీకీచిత్త సంతాపము గలుగవలెనో యోచింపుము.

అవధూత ఉవాచ.

దివానక్తం నతేచిత్త ఉదయాస్తమయౌ నహి
విదేహస్య శరీరత్వం కల్పయంతి కథంబుధాః॥

అవధూతఁ జెప్పుచున్నాఁడు.

తా॥ పగలు లేదు. రాత్రిలేదు. ఉదయములేదు. అస్తమయములేదు. విదేహుఁడగుటవలన శరీరము గలిగి యుండుటయును లేదు. బుధులైనవారు వీనినన్నిఁటినెట్లుగా కల్పింతురో? ఓస్వామీ! యానతి యీయుఁడు.

శ్రీదత్త ఉవాచ.

నావిభక్తం విభక్తం చ నహిదుఃఖ సుఖాదిచ
నహిసర్వమసర్వంచ విద్ధిచాత్మాన మవ్యయమ్॥

తా॥ దత్తాత్రేయుఁడుఁజెప్పుచున్నాఁడు, విభాగము కానిదిలేదు. విభాగమైనదియూలేదు. దుఃఖములేదు. సుఖములేదు. ఈమొదలైన దేదియులేదు. సర్వములేదు. అసర్వమూలేదు. ఆత్మను అవ్యయునిగా నెఱుంగుము.

అవధూత ఉవాచ.

నాహంకర్తానభోక్తాచనమేకర్మపురాధునా
నమేదేహోవిదేహోవా నిర్మమేతి మమేతికిమ్॥

తా॥ అవధూత యడుగు చున్నాఁడు. నేనుకర్తనుగాను. భోక్తనుగాను. నాకు పూర్వకర్మయునులేదు. ఇపుడు చేయుకర్మయునులేదు. నాకు దేహములేదు. విదేహము లేదు. మమఅనియు నిర్మమఅనియు ఇవియే కారణమువలన కలిగినవి?

దత్త ఉవాచ.

న మే రాగాదికో దోషో దుఃఖం దేహాదికం న మే
ఆత్మానం విద్ధిమామేకం విశాలం గగనోపమమ్॥

తా॥ దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు. నాకు రాగాది దోషములులేవు. దేహాదికమయిన దుఃఖములేదు. విశాలమై గగనసదృశమయిన పరమాత్మ నేనేయని నన్ను దలంచుకొనుము. నాకంటె వేరుగ పరమాత్మయనునది మఱియొకటి లేదు.

సఖే మనః కిం బహుజల్పితేన సఖే మనస్సర్వమిదం వితర్క్యమ్
యత్సారభూతం కథితం మయా తే త్వమేవ తత్త్వం గగనోపమోఽసి॥

తా॥ ఓస్నేహితుఁడా! వినుము. అనేకభాషణములతో నేమిప్రయోజనము? మనస్సు నీవేను. ఓస్నేహితుఁడా! ఈ యూహింపఁదగిన సర్వమును మనస్సేగాని వేఱొకటికాదు. అన్నిటికిని సారభూతమయిన దొక్కటి నీకు చెప్పుచున్నాను. ఏమనఁగా? నీవే తత్త్వమవు. గగన సదృశుఁడవును అయినావు. నీకు ద్వంద్వాదులనతిక్రమించువాఁడవు నీవేను.

యేన కేనాపి భావేన యత్ర కుత్ర మృతా అపి
యోగినస్తత్ర లీయంతే ఘటాకాశ మివాంబరే॥

తా॥ యేయేభావముచేతనైనను ఎక్కడెక్కడ మృతులయినను యోగులయినవారు ఘటాకాశము మహాకాశమున లీనమగుకరణి పరమాత్మతో నైక్యము బొందుచున్నారు.

తీర్థే చాన్త్యజగేహే వా నష్టస్మృతిరపి త్యజన్
సమకాలే తనుం ముక్తః కైవల్యవ్యాపకో భవేత్॥

తా॥ తీర్థము నందైనను సరే. అంత్యజాని యింటియందైనను సరే. నష్టస్మృతికలవాఁడైనను సరే. సమకాలమందు శరీరమును విడచిన వాఁడు కైవల్యమును పొందినవాఁడగును. సమకాలమనఁగా? జ్ఞాన వైరాగ్య సంపన్నునియందును. బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, కుక్కలను దిను చండాలునియందును, సర్వసమభావము కలిగియున్న సమయము సమకాలమని చెప్పఁబడును. అనఁగా లోకములోని జాతి గుణ క్రియా తారతమ్యములు మనస్సునకుండనీయక "సర్వంఖల్విదం బ్రహ్మ" యను నభిప్రాయముతో చలింపకయున్న వాఁడు సర్వమయుఁడై కైవల్యమును బొందుననియు, ఇదే సమరసమనియు చెప్పంబడును.

ధర్మార్థకామమోక్షాంశ్చ ద్విపదాదిచరాచరమ్
మన్యన్తేయోగినస్సర్వం మరీచీ జలసన్నిభమ్॥

తా॥ ధర్మార్థ కామమోక్షము లనియెడు పురుషార్థ చతుష్టయము, మనుజాలు మొదలగు చరాచరాత్మకంబగు జగత్తులు, ఈ అన్నింటిని యోగులైనవారు ఎండ మావు లలోని జలముతో సమానముగ దలంతురు.

అతీతానాగతం కర్మవర్తమానంతథైవచ
నకరోమినభుంజామి ఇతిమే నిశ్చలామతిః॥

తా॥ భూతకాలమున గడచిన కర్మయు, భవిష్యత్కాలంబునరాబోవుకర్మయు, వర్తమానకాలమున జరుగుచున్న కర్మయు, నేను చేయువాఁడను కాను. అనుభవించు వాఁడనుకాను. ఈలాగున నాబుద్ధి నిశ్చలమైయున్నది.

శూన్యాగారే సమరసపూత స్తిష్ఠన్నేకస్సుఖమవధూతః
చరతిహినగ్నస్త్యక్త్వాగర్వంవిన్దతి కేవలమాత్మనిసర్వమ్॥

తా॥ శూన్యగృహతుల్యమైన యీ జగంబునందు సర్వసమత్వబుద్ధిచే పవిత్రుఁడై ఒకఁడే సుఖముగా నిల్చియున్న యవధూత. గర్వమును వదలి (దీనివలన లజ్జాభయ మోహ మద మానాదులు గ్రహింపవలయును.) దిగంబరుఁడై తనయందే సర్వము గలదని స్వస్వరూపముకంటె నితరమేదియు కాదని సర్వమును దెలిసికొనుచున్నాఁడు. కేవలా త్మానుసంధానపరుండై సుఖించును.

త్రితయతురీయం నహినహియత్ర విన్దతి కేవలమాత్మనితత్ర
ధర్మాధర్మౌ నహినహియత్రబద్ధోముక్తః కథమిహతత్ర॥

తా॥ ధర్మార్థకామత్రయమున్ను నాలుగవదైన మోక్షమునునదియు నెచ్చటలేదో యచ్చట సర్వమున్ను కేవలమాత్మయందే యని తెలిసికొనుచున్నాఁడు. మఱియు ధర్మా ధర్మము లెచ్చట లేవో యచ్చట బద్ధుఁడనియు, ముక్తుఁడనియు నేలాగున గలుగును? ధర్మార్థకామమోక్షములు. ధర్మాధర్మములు లేనిది కేవలాత్మయని యెఱుంగునది.

విన్దతివిన్దతి నహినహిమన్త్రం ఛన్దోలక్షణం నహినహితన్త్రమ్
సమరసమగ్నో భావితపూతః ప్రలపితమేతత్పరమవధూతః॥

తా॥ ఛందోలక్షణమయిన మంత్రమును ఎఱుఁగడు. ఎఱుఁగడు. తంత్రమును ఎఱుఁ గడు. ఎఱుఁగడు. సర్వసమత్వరసమందు మునిఁగి మునిఁగి నాని నాని పవిత్రుఁడైన యవ ధూత నేమియు నుడువక « మంత్రమూలేదు. తంత్రమూ లేదు. సమత్వమేగలుగును. అట్టి వాఁడే అవధూత» అని మాటిమాటికి జనులకు బోధించును.

సర్వశూన్యమశూన్యం చ సత్యాసత్యం నవిద్యతే
స్వభావభావతః ప్రోక్తం శాస్త్రసంవిత్తిపూర్వకమ్॥

తా॥ సర్వముశూన్యమునగును. అశూన్యమునగును. సత్యమూలేదు. అసత్యములేదు. ఇట్టి యీ సంగతి స్వభావత్వముచేతనే నీకు నాచేత జెప్పంబడినది. శాస్త్రజ్ఞానము నవలంబించి చెప్పినాను. గాని స్వకల్పితముగాదు. ఇచట శాస్త్రమనునది వేదాంత శాస్త్రమును దెల్పుచున్నది గాని యితర (లోక) శాస్త్రములుగావని భావము.

ఇతి శ్రీదత్తాత్రేయ విరచితా యామవధూత
గీతాయామాత్మ సంవిత్త్యుపదేశో నామ
ప్రథమోఽధ్యాయః.

---

శ్రీజగద్గురు విశ్వనాథావధూతపరగుర్వార్పణమస్తు.





శ్రీజగద్గురు విశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి.

అయిదవభాగము-అచలము.

ఆంధ్రతాత్పర్యసహిత

## అవధూతగీత.

### అథద్వితీయోఽధ్యాయః.

అవధూత ఉవాచ.

బాలస్యవాపివిషయభోగరతస్యవాపిమూర్ఖస్య సేవకజనస్య గృహస్థితస్య
ఏతద్గురోఃకిమపినైవనచిన్తనీయంరత్నంకథంత్యజతికోఽప్యశుచౌప్రవిష్టమ్

అవధూత అడుగుచున్నాఁడు.

తా॥ ఓ స్వామీ! అజ్ఞానునకైనను, విషయభోగములయందాసక్తిగలవానికైనను మూర్ఖునకైనను, గురువునకైనను ఏదియు చింతింపఁదగినదే లేదు. అశుచి ప్రదేశమందు ప్రవేశించినను ఎవఁడైనా మంచి రత్నమును విడచునా? విడువఁడు. కావున నీశ్వరాన్యమెద్దియు లేదు. గావున చింతనీయుఁడెవ్వఁడు? చింతనచేయు ధ్యానకర్త ఎవరు? ఏవాఁడును నీశ్వరేతరుఁడు లేఁడు గదా? ధ్యాతృధ్యేయ భావమేలాగున గలిగినదో సెలవియ్యవలయునని యడిగెను.

శ్రీదత్త ఉవాచ.

నైవాత్రకావ్యగుణ ఏవతుచిన్తనీయో
గ్రాహ్యః పరంగుణవతాఖలుసారఏవ
సిన్దూరచిత్రరహితాభువిరూపశూన్యా
పారంనకింనయతి నౌరిహగన్తుకామాన్॥

దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ ఈవిషయమై యిచట కావ్యగుణముమాత్రము చింతనీయమైనది కాదు. గుణవంతునిచేతను తత్సారమే గ్రహింపఁదగినది. సిందూరాదివర్ణములచేత చిత్రమైయున్నట్టియు

రూపశూన్యమైన నావ నదీపారమును గూర్చి వెళ్లనిచ్ఛయించినవారలను పారమును పొందించడములేదా ఏమి? పొందించుటకు చిత్రాదిరూపములేదియు నక్కరలేదని భావము.

ప్రయత్నేనవినాయేన నిశ్చలేనచలాచలమ్
గ్రస్తస్వభావతశ్శాన్తం చైతన్యం గగనోపమమ్॥

తా॥ ప్రయత్నమేమియు లేకుండానే చలించునది చలింపనిదియైనటువంటిన్ని మాయాగ్రస్తమైనటువంటిన్ని స్వభావముచేత క్రియాశూన్యమైయున్న యాత్మస్వభావము వలననే యాకాశ సదృశమైనది.

అవధూత ఉవాచ.

అయత్నాచ్చాలయేద్యస్తు ఏకమేవచరాచరమ్
సర్వగంతత్కథం భిన్నమద్వైతం వర్తతేమమ॥

అవధూత అడుగుచున్నాడు.

తా॥ ఒక్కటే యయియున్న తత్వమును యత్నముచేత కాకుండా చరాచర స్వరూపమైన జగత్తును ఎవ్వడు చలింపజేయునో అట్టి సర్వవ్యాపకమై భిన్నమైన ఆ యద్వైతము నాకు ఏలాగున ప్రవర్తించును?

అహమేవపరం యస్మాత్సారాత్సారతరం శివమ్
గమాగమ వినిర్ముక్తం నిర్వికల్పం నిరాకులమ్॥

తా॥ ఏది కారణమువలన సారాసారములలో నొక్కటియై శివమై రాక పోకలు లేని; నిర్వికల్పమై నిరాకులమైన పరమతత్వమును నేనేయయియున్నాను.

సర్వావయవనిర్ముక్తం తదహంత్రిదశార్చితమ్
సంపూర్ణత్వాన్నగృహ్ణామి విభాగంత్రిదశాదికమ్॥

తా॥ సర్వమయిన యవయవములులేనిదియు దేవాదులచేత బూజింపబడునదియు నగు నా పరతత్వమును నేనైతిని. నేను సంపూర్ణుడనై యుండుటచేత త్రిదశులు మొదలుగాగ విభాగమును నేను గ్రహింపను. నేనంగీకరింపననుట.

ప్రమాదేనసందేహః కింకరిష్యామివృత్తిమాన్
ఉత్పద్యన్తేవిలీయన్తేబుద్బుదాశ్చయథాజలే॥

తా॥ ప్రమాదముచేతను సందేహములేదు. నేను వృత్తిగాగలవాడనై యేమిచేయగలను? జలమందు బుద్బుదములవలె నవియన్నియు పుట్టుచుండును. నశించుచుండును.

మహదాదీనిభూతాని సమాప్యైవం సదైవహి
మృదుద్రవ్యేషుతీక్ష్ణేషుగుడేషుకటుకేషుచ
కటుత్వంచైవశైత్యత్వం మృదుత్వంచ యథాజలే
ప్రకృతిః పురుషస్తద్వదభిన్నం ప్రతిభాతిమే॥

తా॥ మహదాదులు అనఁగా ప్రకృతివలన మహత్తు. మహత్తువలన నహంకారము. అహంకారమువలన బంచతన్మాత్రలు. వానివలన పంచభూతములు. పంచభూతములలో పృథివివలన నోషధులు. ఓషధులవలన నన్నము. అన్నమువలన చేతనములన్నియు పుట్టుచున్నవి. ఇట్టి భూతములెవ్వియు నీలాగున సమాప్తినొందించి యెల్లప్పుడును మృదుద్రవ్యములయందు, తీక్ష్ణద్రవ్యములయందు, మధురద్రవ్యములయందు, చేదుద్రవ్యములయందు, కటుత్వము, శైత్యత్వము, మృదుత్వము, ఏలాగునజలమందుండునో ఆలాగున ప్రకృతియు పురుషుఁడును అభిన్నముగా నాకు తోఁచుచున్నది.

(శ్రీదత్తఉవాచ)

సర్వాఖ్యా రహితం యద్యత్సూక్ష్మాత్సూక్ష్మతరం పరమ్
మనో బుద్ధీంద్రియాతీత మకలఙ్కం జగత్పతిమ్॥

దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ సమస్తమయిన నామధేయములు లేనిది యేదియేది సూక్ష్మములకంటె సర్వసూక్ష్మమైన పరమయినదో, మనస్సునకు, బుద్ధికి, ఇంద్రియములకు నతిక్రమించునదో, కలంకరహితమై జగత్తునకు ప్రభుభూతమైనదో అదే పరతత్వమైనది.

ఈదృశం సహజంయత్ర అహంత్రత కథంభవే
త్వమేవ హికథంతత్ర కథంతత్ర చరాచరమ్॥

తా॥ ఇట్టి సంగతులన్నియు నెచ్చట సహజమో అచ్చట నేనెటుల కాగలను? నీవే అచ్చటనెట్లున్నావు? అచ్చటనే చరాచరమైన ప్రపంచమెటులనుండును?

గగనోప మంతుయత్ప్రోక్తం తదేవగగనోపమమ్
చైతన్యం దోషహీనంచ సర్వజ్ఞం పూర్ణమేవచ॥

తా॥ ఏది గగనసదృశమైనదని చెప్పఁబడినదో అదే గగనసదృశమైయున్నది. అది జ్ఞానశక్తికమైనది. దోషహీనమైనది. సర్వజ్ఞానసహితమయినది. పరిపూర్ణమయినదియునై యున్నది.

పృథివ్యాంచరితంనైవ మారుతేనచ వాహితమ్
వారిణాపి హితంనైవ తేజోమధ్యేవ్యవస్థితమ్॥

తా॥ ఆయనకు భూమియందు చరిత్రము లేదు. ఆయన వాయువుచేత వహింపఁబడుటలేదు. ఆయన నీరుచేత గమ్యంబడినదియు లేదు. ఆయన తేజోమండలమధ్యమునందును లేదు.

ఆకాశం తేన సంవ్యాప్తం నతద్వ్యాప్తంచ కేనచిత్
సబాహ్యాభ్యన్తరం తిష్టత్యవచ్ఛిన్నం నిరన్తరమ్॥

తా॥ ఆతనిచేత ఆకాశము వ్యాపింపఁబడియుండలేదు. దేనిచేతను నాతఁడు వ్యాపింపఁబడియుండలేదు. అతఁడు బాహ్యాభ్యంతరములయందు వ్యాపించియున్నాఁడు. నిరంతరముగ వ్యాప్తిగలిగియుండును.

సూక్ష్మత్వాత్తదదృశ్యత్వాన్నిర్గుణత్వాచ్చయోగిభిః
ఆలమ్బనాది యత్ప్రోక్తం క్రమాదాలమ్బనంభవేత్॥

తా॥ సూక్ష్మమగుటవలనను, అదృశ్యమగుటవలనను, నిర్గుణమైనదగుటవలనను, యోగులచేత నాలంబనాదికము ఏది చెప్పఁబడినదో అదే క్రమము వలననే యాలంబనమగుచున్నది.

సతతాఽభ్యాసయుక్తస్తు నిరాలమ్బో యదాభవేత్
తల్లయాల్లీయతే నాన్తర్గుణదోషవివర్జితః॥

తా॥ సర్వకాలము అభ్యాసముతోఁగూడినవాఁడు నిరాలంబనుఁడెప్పుడగునో అప్పుడే అంతర్గుణదోషములు లేనివాఁడైన ప్రత్యగాత్ముఁడు అభ్యాసాదిలయయోగము వలన లీనుఁడు కాకుండును.

విషవిశ్వస్య రౌద్రస్య మోహమూర్చాప్రదస్యచ
ఏకమేవ వినాశాయహ్యమోఘం సహజామృతమ్॥

తా॥ విషమువంటి భీకరమైనట్టియు, అజ్ఞానమనెడు మూర్ఛను గలుగఁజేయునట్టియు, సంసారరూపమైన జగత్తుకు అమోఘముగా నాశము గలుగజేయుటకొఱకు సహజమైన యద్వైతానందమొకటే తగినది.

భావగమ్యం నిరాకారం, సాకారం దృష్టిగోచరమ్
భావాభావవినిర్ముక్తమన్తరాలం తదుచ్యతే॥

తా॥ అనుభవముచేత దెలిసికొనఁదగినదియు, ఆకారశూన్యమైనదియు, సాకారమైనదియు, కన్నులకగపడునదియు, సదసద్భావవినిర్ముక్తమైనదియు, ఏదిగలదో అదియే యంతరాళమని చెప్పఁబడును.

బాహ్యాభావం భవేద్విశ్వ మన్తః ప్రకృతిరుచ్యతే
అన్తరా ద న్తరం జ్ఞేయం నాలికేర ఫలామ్బువత్ ॥

తా॥ జగత్తంతయు బాహ్యాభావమును (అనఁగా దృశ్యమగుటను.) బొందినదగును. ప్రకృతి, లోపలనుండును. (మనోబుద్ధ్యహంకారాదులు) లోపలనుండును. అంతరము కంటె నంతరముగా కొబ్బరికాయలోని నీరువలె నాత్మయుండును.

భ్రాన్తిజ్ఞానం స్థితం బాహ్యేసమ్యగ్జ్ఞానం చమధ్యగమ్
మధ్యాన్మధ్యతరం జ్ఞేయంనాలికేర ఫలామ్బువత్ ॥

తా॥ బాహ్యమునందు భ్రాంతిజ్ఞానముకలదు. లెస్సగా జ్ఞానముచేయుట మధ్య స్థితమయినది. మధ్యముకంటె మధ్యత్వమును నారికేళఫలము (కొబ్బరికాయ)లోని నీటి వలె నిల్చియుండును.

పౌర్ణమాస్యాం యథాచన్ద్ర ఏకఏవాతి నిర్మలః
తేనతత్సదృశంపశ్యేద్ద్విధా దృష్టిర్విపర్యయః॥

తా॥ పూర్ణిమయందు చంద్రునివలె నొక్కఁడే యతి నిర్మలుఁడు. అతనితో సమానమై రెండు విధములుగా దృష్టి విపర్యాసము చూడవలయును.

అనేనైవ ప్రకారేణబుద్ధి భేదోన సర్వగః
దాతాచ ధీరతామేతి గీయతే నామకోటిభిః॥

తా॥ ఈ ప్రకారముగానే బుద్ధిభేదము సర్వవ్యాపకమైనదై యున్నది. దాత యున్ను ధీరత్వమును బొందుచున్నాఁడు. కేవలము కోటి నామములచేత గానముచేయఁబడుచున్నది.

గురుప్రజ్ఞా ప్రసాదేన మూర్ఖోవాయది పణ్డితః
యస్తుసంబుధ్యతే తత్వం విరక్తో భవసాగరాత్ ॥

తా॥ గురువుయొక్క ప్రజ్ఞారూపమయిన యనుగ్రహముచేత మూర్ఖుఁడైనను, పండితుఁడైనను సరే. యెవఁడైతే సంసార సముద్రమునుండి విరక్తుఁడై తత్వమును తెలుసుకొనుచున్నాఁడో వాఁడే యుత్తముఁడు.

రాగద్వేష వినిర్ముక్తస్సర్వభూతహితేరతః
దృఢబోధశ్చ ధీరశ్చ సగచ్ఛేత్పరమంపదమ్॥

తా॥ రాగద్వేషములనుండి విడువఁబడినవాఁడును, సర్వభూతములయొక్క హితము నందాసక్తిగలవాఁడును, దృఢమయిన బోధగలవాఁడును, ధీరుఁడును అయినవాఁడు పరమగతిని బొందుచున్నాఁడు.

న శాంభవం శాక్తిక మానవం నవా
పిణ్డం చరూపంచ పదాదికం నవా
ఆరమ్భ నిష్పత్తి ఘటాది కంచనో
తమీశమాత్మాన ముపైతి శాశ్వతమ్॥

తా॥ శాంభవములేదు. శాంభవమనఁగా సుఖమునిచ్చునట్టి శంభునియొక్క ముద్ర. శక్తి సంబంధమయినదిలేదు. మనుష్య సంబంధమైనదియులేదు. పిండములేదు. రూపములేదు. కాళ్లు చేతులునులేవు. ఆరంభమువలన గలుగునట్టి ఘటాదులునులేవు. ప్రసిద్ధుఁడై నియామకుఁడై, శాశ్వతుఁడైన పరమాత్మను యోగియగువాఁడుఁ బొందుచున్నాఁడు.

యస్యస్వరూపాత్స చరాచరం
జగదుత్పద్యతే తిష్ఠతి లీయతేఽపివా
పయోవికారాదివ ఫేనబుద్బుదా
స్తమీశ మాత్మానము పైతి శాశ్వతమ్॥

తా॥ ఎవని స్వరూపమువలన చరాచరమిశ్రమయిన జగత్తు ఉదయించుచున్నదో, ఉంటూ ఉన్నదో, లీనమగుచున్నదో, నీళ్లవికారములయి నురుగు బుడగలవలె ఎవనియందు జగంబునిలుచుచున్నదో, అట్టిశాశ్వతమై ప్రాభవ లక్షణముగల ఆత్మను యోగియైనవాఁడుఁ బొందుచున్నాఁడు.

నాసాని రోధోన చదృష్టిరాసనం
బోధోఽప్యబోధోఽపిన యత్రభాసతే
నాడీప్రచారోఽపినయత్ర కించి
త్తమీశ మాత్మానము పైతి శాశ్వతమ్॥

తా॥ నాసికారంధ్రముల నిరోధములేదు. దృష్టి నిరాసములేదు. బోధయున్ను అబోధయున్ను ఎచ్చట ప్రకాశింపదో, నాడీపరిచారమెచ్చటలేదో, అటువంటి శాశ్వతమయిన పరమేశ్వరుఁడగు నాత్మను యోగి పొందుచున్నాఁడు.

నానాత్వమేకత్వముభత్వమన్యతా
అణుత్వదీర్ఘత్వ మహత్త్వ శూన్యతా
మానత్వమేయత్వసమత్వవర్జితం
తమీశ మాత్మానము పైతిశాశ్వతమ్॥

తా॥ అనేకత్వము, ఏకత్వము, ఉభయత్వము, అన్యత్వము, అణుత్వము, దీర్ఘత్వము, మహత్త్వము, శూన్యత్వము, ప్రమాణత్వము, ప్రమేయత్వము, సమత్వము లేని

యేదియుఁ లేనటువంటిది యేదో ఆటువంటి శాశ్వతమయిన ప్రభువైన యాత్మతత్వమును యోగియగువాఁడుఁ బొందుచున్నాఁడు.

సుసంయమీ వాయదివానసంయమీ
సుసంగ్రహీవాయదివానసంగ్రహీ
నిష్కర్మకోవా యది వాసకర్మక
స్తమీశ మాత్మానము పైతి శాశ్వతమ్॥

తా॥ మిక్కిలి నియమవంతుఁడైనా, నియమము లేనివాఁడైనను, మిక్కిలి సంగ్రహములేనివాఁడైనను, (సంగ్రహమనఁగా తపస్సు. ధనము.) నిష్కర్ముఁడైనను సరే. కర్మసహితుఁడైనను సరే. అటువంటి శాశ్వతమయి, నియామకుఁడైన పరమాత్మను యోగి పొందును.

మనో నబుద్ధిర్న శరీర మిన్ద్రియం
తన్మాత్రభూతానినభూత పంచకమ్
అహంకృతి శ్చాపివియత్స్వ రూపకం
తమీశ మాత్మానము పైతిశాశ్వతమ్॥

తా॥ మనస్సుకాదు, బుద్ధికాదు, శరీరముకాదు, ఇంద్రియములుకావు, పంచతన్మాత్రలుకావు, పంచభూతములుకావు, అహంకారముకాదు, పరమాకాశముకాదు, వీనినన్నిఁటిని వదలి యోగియైనవాఁడు ప్రసిద్ధుఁడై, నియామకుఁడైన పరమాత్మనుబొందును.

విధౌనిరోధే పరమాత్మ తాంగతే
న యోగిన శ్చేతసి భేదవర్జితే
శౌచంనవాశౌచమలిఙ్గ భావనా
సర్వం విధేయంయది వానిషిధ్యతే॥

తా॥ విధి, నిరోధమునందు పరమాత్మత్వమును బొందఁగా యోగియొక్క చిత్తము భేదవర్జితము కాకుండ నుండఁగా శుచిత్వము లేదు, అశుచిత్వములేదు, లింగములయొక్క ధ్యానములేదు, (లింగమనఁగా ఆకారము) నిషేధింపఁబడినదైననుచేయఁదగినదే, యోగికి విధినిషేధములతో నిమిత్తములేక అన్ని పనులుచేయ వచ్చునని భావము.

మనోవచో యత్ర నశక్తమీరితుం
నూనంకథం తత్రగురూపదేశతా
ఇమాంకథా ముక్తవతోగురో స్త
ద్యుక్తస్య తత్వంహిసమం ప్రకాశతే॥

తా॥ మనస్సుగాని, వాక్కులుగాని (యీరెండునుగాని) చెప్పుటకు శక్తిగలవి కావో ఆవస్తువు విషయమై గురూపదేశత్వ మెటుల నిర్ణయింపవచ్చును, ఈలాగున నీకథను చెప్పుచున్న గురువునకును ఆయనతో గలసిన శిష్యునకు యోగసంపన్నునకును, తత్వము సమముగాఁ బ్రకాశించుచున్నది.

ఇతి శ్రీ దత్తాత్రేయ విరచితా యామవధూత
గీతాయామాత్మ సంవిత్త్యుపదేశో నామ
ద్వితీయోఽధ్యాయః

---

శ్రీజగద్గురు విశ్వనాథావధూత పరగుర్వర్పణమస్తు.





శుభమస్తు.

శ్రీజగద్గురు విశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి.

అయిదవభాగము-అచలము.

ఆంధ్రతాత్పర్యసహిత

## అవధూతగీత.

### అథతృతీయోఽధ్యాయః.

అవధూత ఉవాచ.

గుణవిగుణ విభాగో వర్తతేనైవకించి
ద్రతివిరతి విహీనం నిర్మలం నిష్ప్రపంచమ్
గుణవిగుణవిహీనం వ్యాపకం విశ్వరూపం
కథమహమిహవన్దే వ్యోమరూపం శివంనై॥

అవధూత యడుగుచున్నాఁడు.

తా॥ ఓ దత్తాత్రేయస్వామీ! తా ముపదేశించిన విధంబునందు గుణమని, ణవిగుమని, యీ భాగమేమియును లేదు. రాగవిరాగములులేనట్టియు, నిర్మలుఁడైనట్టియు ప్రపంచాతీతుఁడైనట్టియు, గుణాగుణములు లేనట్టియు, వ్యాపకుఁడై జగద్రూపుఁడైనట్టియు, నాకాశరూపుఁడైన పరమాత్మని నేనెట్లు వందనముచేయవలెను.

శ్వేతాదివర్ణరహితో నియతంశివశ్చ
కార్యం హికారణమిదం హిపరంశివశ్చ
ఏవం వికల్పరహితోఽహమ్మలం శివశ్చ
స్వాత్మానమాత్మని సుమిత్రకథం నమామి॥

తా॥ ఇహపరలోక మిత్రుఁడవగు నోస్వామీ! పరమాత్ముఁడు శ్వేతపీతాది వర్ణములులేనివాఁడు. ఎల్లప్పుడును జ్యోతిస్వరూపుఁడు. కార్యస్వరూపముగాను కారణ

రూపముగాను, యున్న జగత్తే అయినట్టివాఁడు పరమాత్ముఁడు. ఈలాగున నేవికల్ప రహితుఁడనైన నేనును శివుఁడనైయుంటిని. నా ఆత్మయందు నా ఆత్మనుగూర్చి యేలాగున నమస్కరించుచున్నాను. నమస్కరింపవలసినది యెందుకొఱకు? అని ప్రశ్నరూపముగా నడిగెను.

నిర్మూలమూలరహితోహి సదోదితోఽహం
నిర్ధూమధూమరహితోహి సదోదితోఽహమ్
నిర్దీపదీపరహితోహి సదోదితోఽహం
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ నేను మూలము, నిర్మూలములేనివాఁడనై యెల్లప్పు డుదయించుచున్నాను. నేను ధూమ నిర్ధూమములులేనివాఁడనై యెల్లప్పుడుదయించుచున్న వాఁడను. దీపము నిర్దీపములేక యెల్లప్పుడు ప్రకాశించువాఁడనై యుదయించినాఁడను. జ్ఞానానంద స్వరూపుఁడనై, విధి నిషేధములులోనగునవి లేక సదా సమానుభవముగలవాఁడనైయున్నాను.

నిష్కామకామమిహ నామకథం వదామి
నిస్సంగసంగ మిహ నామకథం వదామి
నిస్సారసార రహితంచకథంవదామి
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనైన నేను నిష్కామమని, కామమనియు నేనెటుల జెప్పుదును. నిస్సంగమని, సంగమని, నే నేమని చెప్పుచున్నాను. నిస్సారము, సారము అనునవి లేని నేను ఏలాగునని చెప్పుచున్నాను. ఏది చెప్పుటకుఁ గారణము కనుపించలేదు. ఏకారణము వలన జెప్పఁగలను.

అద్వైతరూపమఖిలంహికథంవదామి
ద్వైతస్వరూప మఖిలంహి కథంవదామి
నిత్యంత్వనిత్యమఖిలంహికథంవదామి
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ సమస్తము అద్వైతరూపమని యెటుల పలుకుదును. సమస్తము ద్వైతరూప రూపమని యేలాగున చెప్పుదును. ఈసమస్తమును నిత్యమనిగాని, అనిత్యమనిగాని యేలాగున చెప్పుదును. నేను జ్ఞానానందస్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

స్థూలంహినోనహికృశంనగతాగతంహి
ఆద్యన్తమధ్యరహితంన పరాపరంహి
సత్యంవదామిఖలువైపరమార్థతత్త్వం
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ స్థూలము గానులేదు. కృశమై యుండియు లేదు. గమనాగమనములులేవు. ఆద్యంతమధ్యరహితమైన పరాత్పరములేదు. పరమార్థతత్త్వమయిన సత్యమును చెప్పుచున్నాను. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశ తుల్యుఁడనై యున్నాను.

సంవిద్ధిసర్వకరణాని నభోనిభాని సంవిద్ధి
సర్వవిషయాశ్చ నభోనిభాశ్చ
సంవిద్ధిచైకమమలం నహిబన్ధముక్తం
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ సమస్తమయిన యింద్రియములను అకాశతుల్యములనుగా దెలిసికొనుము. (లేనివని భావము.) సమస్తమయిన విషయములు (శబ్దాదులు) ఆకాశతుల్యములని దెలిసికొనుము. నిర్మలమై యొకటేయయిన పరతత్త్వమున్నదిగాని యది బంధవిముక్తి నొందినది కాదు. నేను జ్ఞానానందస్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

దుర్బోధబోధగహనోనభవామి తాత
దుర్లక్ష్యలక్ష్య గహనోనభవామితాత
ఆసన్నరూప గహనోనభవామితాత
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ ఓ. తండ్రీ! దుర్బోధము, బోధము అనే అరణ్యమును నేనుకాను. చూడ శక్యముగాని చూడశక్యమయిన తత్త్వమును నేనుగాను. ఓ తండ్రీ! సమీపమునందున్న గహనమును నేనుగాను. ఓతండ్రీ నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

నిష్కర్మకర్మదహనో జ్వలనోభవామి
నిర్దుఃఖదుఃఖదహనో జ్వలనోభవామి
నిర్దేహదేహదహనోజ్వలనోభవామి
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ నిష్కర్మలను, కర్మలను దహించునట్టి జ్వాలారూపమయిన యగ్ని నగుచున్నాను. నిర్దుఃఖము, దుఃఖము అనెడివానిని దహించునట్టి యగ్ని ని నేనగుచున్నాను.

నిర్దేహమును, దేహమునుదహించునట్టి యగ్ని జ్వాలను నేనగుచున్నాను. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

నిష్పాప పాపదహనో హి హుతాశనోఽహం
నిర్ధర్మధర్మదహనో హి హుతాశనోఽహమ్
నిర్బన్ధబన్ధదహనో హి హుతాశనోఽహం
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ నిష్పాపము, పాపము, వీని దహించునట్టి యగ్ని నగుచున్నాను. నిర్ధర్మము, ధర్మము అను వానిని మండించునట్టి యగ్ని హోత్రుఁడను నేనే యగుచున్నాను. నిర్బంధము, బంధము అనువానిని దహించునట్టి యగ్ని హోత్రుఁడనగుచున్నాను. నేను జ్ఞానానందస్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనైయున్నాను.

నిర్భావభావరహితో న భవామివత్స
నిర్యోగయోగరహితో న భవామివత్స
నిశ్చిత్తచిత్తరహితో న భవామివత్స
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ నిర్భావము, భావములేనివాఁడను కాను. నిర్యోగము, యోగములేనివాఁడను కాను. నిశ్చిత్తము, చిత్తములేనివాఁడనుకాను. నేను జ్ఞానానందస్వరూపుఁడనై, సమసరమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

నిర్మోహమోహ పదవీతి న మే వికల్పో
నిశ్శోకశోకపదవీతి న మే వికల్పః
నిర్లోభలోభపదవీతి న మే వికల్పో
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ నిర్మోహము, మోహము అని వికల్పము నాకులేదు. నిశ్శోకము, శోకము అని నాకువికల్పములేదు. లోభమని, నిర్లోభమని నాకు వికల్పములేదు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనైయున్నాను.

సంసారసంతతి లతా న చ మే కదాచి
త్సంతోష సంతతి సుఖే న చ మే కదాచిత్
అజ్ఞానబన్ధనమిదం న చ మే కదాచి
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ సంసారసంతతి యనెడు తీగ నాకు నెన్నఁడును లేదు. సంతోషసంతతి సుఖములున్ను నాకెన్నఁడును లేవు. అజ్ఞానరూపమైన యీబంధమున్ను నాకెన్నఁడును లేదు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై, యున్నాను.

సంసారసంతతిరజోనచమే వికార
స్సంతాపసంతతి తమోనచమే వికారః
సత్వంస్వధర్మజనకం నచమే వికారో
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ సంసారసంతతి యనెడి రజోగుణ వికారము నాకు లేదు. సంతాపసంతతి యనెడి తమోగుణ వికారమున్ను లేదు. స్వధర్మోత్పాదకమయిన సత్వగుణ వికారమున్ను నాకు లేదు. అయితే నేను జ్ఞానానందస్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

సంతాపదుఃఖజనకోనవిధిఃకదాచి
త్సంతాపయోగజనితంనమనఃకదాచిత్
యస్మాదహంకృతిరియంనచమేకదాచి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ సంతాపదుఃఖ జనకమైన విధి నాకెన్నఁడును లేదు. నాయొక్క మనస్సు ఎప్పుఁడును సంతాపయోగమును బుట్టించునది కాదు. నాకు నీయహంకారమున్ను యెన్నఁడును గలుగదు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశ తుల్యుఁడనై యున్నాను.

నిష్కమ్పకమ్పనిధనంవికల్పకల్పం
స్వప్నప్రబోధనిధనంనహితాహితంహి
నిస్సారసారనిధనంనచరాచరంహి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ నిష్కంపము (నిశ్చలత) కంపము (చలనము) నిధనము (మృతి) ఇవి నావి కల్పములోనివి కావు. ఎప్పుడేది జరిగినను నాదికాదనియుపేక్షించుచుందునని భావము. స్వప్నము, జాగరము, సుషుప్తియును లేవు. హితములేదు. అహితములేదు. నిస్సారము, సారము, నిధనముగల చరాచరములు నాకులేవు. నేను కేవలము జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

నోవేద్య వేదకమిదంనచ హేతుతర్క్యం
వాచామగోచరమిదంనమనోనబుద్ధిః
ఏవంకథంహిభవతఃకథయామితత్త్వం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ వేద్యము (తెలియఁదగినది) లేదు. వేదకము (తెలియువాఁడు) లేదు. ఊహింపఁదగిన హేతువులేదు. ఇది వాచామగోచరమయినది. (వాక్కులతోఁ జెప్పుటకు శక్యముకానిది.) మనస్సులేదు. బుద్ధిలేదు. ఈవిధముగానున్న తత్త్వమును నేనే లాగున జెప్పుదును. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

నిర్భిన్నభిన్నరహితంపరమార్థతత్త్వ
మన్తర్బహిర్నహికథంపరమార్థతత్త్వమ్
ప్రాక్సంభవంనచరతంనహివస్తుకించి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ భిన్నముకానిది భిన్నమైనది యనునవి రెండును లేని పరమార్థమయిన తత్త్వము అంతరమందును లేదు. బాహ్యమందును లేదు. అదే పరమార్థతత్త్వము. అనాది కాలమందు సంభవించినది. ఆసక్తికలదికాదు. ఏమియును వస్తువుగాలేదు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

రాగాదిదోషరహితంత్వహమేవతత్త్వం
దైవాదిదోషరహితంత్వహమేవతత్త్వమ్
సంసారశోకరహితంత్వహమేవతత్త్వం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ రాగాదిదోష రహితమయిన తత్త్వమును నేనేను. దైవాదిదోషము లేని దత్త్వమును నేనేను. (దైవమనఁగా దేవాది సృష్టిరూప దోషమనుట.) సంసార సంబంధ మయిన శోకములు లేని తత్త్వమును నేనేను. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమ రసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

స్థానత్రయంయదిచనేతికథంతురీయం
కాలత్రయంయదిచనేతికథందిశశ్చ
శాన్తంపదంహిపరమంపరమార్థతత్త్వం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ మొదటి మూఁడు స్థానములు లేనప్పుడు తురీయము (అనఁగా నాల్గవ స్థానము) ఏలాగున కలుగును. (జాగ్రత్స్వప్న సుషుప్తులు మొదటి మూఁడు స్థానములు నాల్గవది పరబ్రహ్మానందానుభవము.) కాలత్రయము లేనట్టయితే దిక్కులు ఏలాగున గలుగును. (ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము, అనునవి కాలత్రయము.) సూర్యోదయాస్తమయములంబట్టి దిక్కులు దెలియుచున్నవి. ఆ కాలములు లేకుంటే దిక్కుల నిర్ణయము లేదనిభావము. పరమార్థతత్త్వము ఏమియు చేష్టలులేక సర్వోత్తమమైయున్నది. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసుమునై, యాకాశతుల్యుఁడనైయున్నాను.

దీర్ఘోలఘుఃపునరితీహ న మేవిభాగో
విస్తారసంకటమితీహ న మేవిభాగః
కోణంహివర్తులమితీహ న మేవిభాగో
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ దీర్ఘమని, హ్రస్వమనియు, నిటువంటి విభాగము నాకు లేదు. విస్తారమనియు, సంకట (ఇరుకుచోటు) మనియు, నాకు విభాగములేదు. కోణమనియు, వర్తులమనియు, నాకేమియు విభాగములేదు. ఇఁక నేమనఁగా నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

మాతాపితాదితనయాదిన మేకదాచి
జ్జాతంమృతంనచమనోనచమేకదాచిత్
నిర్వ్యాకులంస్థిరమిదంపరమార్థతత్త్వం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ తల్లియని, తండ్రియని, కొమారులనియు, నాకెన్నఁడును లేదు. పుట్టుకయనియు, చావు అనియు, మనస్సు అనియు, నాకెన్నఁడును లేదు. వ్యాకులము లేక స్థిరమైన యిది పరమార్థతత్త్వము, నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

శుద్ధంవిశుద్ధమవిచారమనన్తరూపం
నిర్లేపలేపమవిచారమనన్తరూపమ్
నిష్ఖణ్డఖణ్డమవిచారమనన్తరూపం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ శుద్ధముకాదు. విశుద్ధముకాదు. విచారముకాదు. ఇఁక నేమనఁగా ననంతరూపమైయున్నది. లేపమయినది కాదు. నిర్లేపమయినది కాదు. విచారించుటకు శక్యము

కానిదియు, ననంతరూపమైనదియునై యున్నది. అఖండము కాదు. సఖండము కాదు. విచారింప శక్యము కానిదియు, అనంతరూపమైనదియునైనది. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

బ్రహ్మాదయస్సురగణాఃకథమత్రసంతి
స్వర్గాదయోవసతయఃకథమత్రసంతి
యద్యేకరూపమమలంపరమార్థతత్త్వం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ బ్రహ్మాదులయిన దేవగణములు ఎట్లుగా నిచ్చటనున్నారు. స్వర్గాది లోకములున్ను ఎట్లుగా నిచట గలిగియున్నవి. నిర్మలమయిన పరమార్థ తత్త్వమేకరూపమయి నట్టయితే పిపీలికాది బ్రహ్మపర్యంతమయిన జీవజాతములున్ను, రసాతలాది సత్యలోక పర్యంతమయిన లోకములున్ను ఎందునిమిత్తమున్నవి. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనైయున్నాను.

నిర్నేతినేతివిమలోహికథంవదామి
నిశ్శేషశేషవిమలోహికథంవదామి
నిర్లింగలింగవిమలోహికథంవదామి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ పరమపురుషుఁడు నిర్నీతి నీతులు లేక విమలుఁడై యున్నవాఁడు. ఎట్లుగాఁ జెప్పుదును. నిశ్శేషము, శేషము లేక నిర్మలుఁడై యున్నవాఁడు. ఎట్లుగాఁ జెప్పుదును. నిర్లింగము లేక, లింగము లేక, విమలుఁడై యున్న వానిని నేనెట్లు చెప్పుదును. (లింగమనఁగా సూక్ష్మశరీరము. తన్మాత్ర సహితమయినది. తన్మాత్ర యనఁగా అణువు) నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను,

నిష్కర్మకర్మపరమంసతతంకరోమి
నిస్సంగసంగరహితంపరమంవినోదమ్
నిర్దేహదేహరహితంసతతంవినోదం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ శ్రేష్ఠమయిన నిష్కర్మకర్మను ఎల్లప్పుడు చేయుచున్నాను. (నిష్కామ మని యర్థము) నిస్సంగము, సంగము యీరెండును లేని వినోదము సర్వోత్తమము. నిర్దేహము దేహము, ఈరెండును లేని వినోదమే ఎల్లప్పుడు నుండవలయును. (నిర్దేహమనఁగా లింగ శరీర వర్జితము. దేహమనఁగా స్థూల శరీరము.) నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

మాయాప్రపంచరచనానచమేవికారో
కౌటిల్యదమ్భరచనానచమేవికారః
సత్యానృతేతిరచనానచమేవికారో
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ మాయద్వారా ప్రపంచమును సృష్టించుట నా వికారము కాదు. కుటిలత్వము, డంబము, మొదలైన వాని రచనయున్ను నా వికారముకాదు. సత్యమని, అబద్ధమని, అనునవి నా వికారము కాదు. నేను జ్ఞానానంద స్వరూపుడనై, సమరసముగనై, యాకాశతుల్యుడనై యున్నాను.

సంధ్యాదికాలరహితంనచమేవియోగ
అన్తఃప్రబోధరహితంబధిరోనమూకః
ఏవంవికల్పరహితంనచభావశుద్ధం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ సంధ్యాదికాల రహితుడనైన నాకు వియోగము లేదు. (సర్వకాల స్వరూపుడని భావము) అంతస్సునందు జ్ఞానము లేని బధిరుడను (చెవిటివానిని) గాను, మూగవానిని గాను, ఇటువంటి వికల్పములు తెలివాడను గాను. భావమునందు శుద్ధుడను గాను, ఇక నేమనగా జ్ఞానానంద స్వరూపుడనై, సమరసముగనై, యాకాశతుల్యుడనై యున్నాను.

నిర్నాథనాథరహితంహినిరాకులంవై
నిశ్చిత్తచిత్తవిగతంహినిరాకులంవై
సంవిద్ధిసర్వవిగతంహినిరాకులంవై
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ నాథుడు లేక నిర్నాథుడు లేక నిరాకులమై (మనఃకల్మషము లేనిది) నిశ్చిత్తము, చిత్తము లేక వ్యాకులము గానిదియు, సర్వము శూన్యమై నిరాకులమైన దానిని గా పరమాత్మను దెలిసికొనుము, నేను జ్ఞానానంద స్వరూపుడనై, సమరసముగనై, యాకాశతుల్యుడనై యున్నాను.

కాన్తారమన్దిరమిదంహికథంవదామి
సంసిద్ధిసంశయమిదంహికథంవదామి
ఏవంనిరన్తరసమంహినిరాకులంవై
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ ఈప్రపంచము ఆరణ్యమందిరము వంటిది. దీని నేమని చెప్పుదును. ఇదియెల్లప్పుడు విద్ధమైన యనేక సంశయములు గలది. దీని నేమని చెప్పుదును. ఈలాగున నెల్లప్పుడు సమమై, నిరాకులమైన దాని నేనెట్లు చెప్పుదును. నేనైతే జ్ఞానానంద స్వరూపుండనై, సమరసముననై, యాకాశతుల్యుండనై యున్నాను.

నిర్జీవజీవరహితంసతతంవిభాతి
నిర్బీజబీజరహితంసతతంవిభాతి
నిర్వాణబన్ధరహితంసతతంవిభాతి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ నిర్జీవ జీవరహితమై ఎల్లప్పుడు ప్రకాశించుచున్నది. (చేతనా చేతనములు) నిర్బీజబీజరహితమై ఎల్లప్పుడును ప్రకాశించుచున్నది. (కార్యకారణములు లేనిదని తా॥) మోక్షము, బంధము, అనునవి లేక యెల్లప్పుడును ప్రకాశించుచున్నది. నేనైతే జ్ఞానానంద స్వరూపుండనై, సమరసముననై, యాకాశతుల్యుండనై యున్నాను.

సంభూతివర్జితమిదంసతతంవిభాతి
సంసారవర్జితమిదంసతతంవిభాతి
సంహారవర్జితమిదంసతతంవిభాతి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ జన్మరహితమైయెల్లప్పుడీ తత్వము ప్రకాశించుచున్నది. సంసారములేనిదై యీతత్వమెల్లప్పుడు ప్రకాశించుచున్నది. సంహారము (లయము) లేనిదైయెల్లప్పుడు ప్రకాశించుచున్నది. నేనైతే జ్ఞానానంద స్వరూపుండనై, సమరసముననై, యాకాశతుల్యుండనై యున్నాను.

ఉల్లేఖమాత్రమపి తేనచనామరూపం
నిర్భిన్నభిన్నమపి తేనహివస్తుకించిత్
నిర్లజ్జమానసకరోషికథంవిషాదం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ లజ్జలేని ఓ మనస్సా! నీయొక్క నామరూపములు లేఖామాత్రమయినను లేవు. నీకు నిర్భిన్నమని, భిన్నమని చెప్పునట్టి వస్తువొక్కటియును లేదు. ఎందుకు దుఃఖించుచున్నావు. నేను జ్ఞానానందస్వరూపుండనై, సమరసముననై, యాకాశతుల్యుండనైయున్నాను.

కింనామరోదిషిసఖేనజరానమృత్యుః
కింనామరోదిషిసఖేనచజన్మదుఃఖమ్
కింనామరోదిషిసఖేనచతేవికారో
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తా॥ మిత్రమైన ఓ మనస్సా! నీకు పుట్టుక, చావు, అనునవిలేవు. ఎందుకు దుఃఖించుచున్నావు. నీకు జన్మదుఃఖములేదు, ఎందుకు దుఃఖించుచున్నావు. ఓమిత్రమైన మానసమా నీకే వికారములును లేవు. ఎందుకు దుఃఖించుచున్నావు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

కింనామరోదిషిసఖేనచతేస్వరూపం
కింనామరోదిషిసఖేనచతేవిరూపమ్
కింనామరోదిషిసఖేనచతేవయాంసి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ ఓ స్నేహితుఁడా! నీకు స్వరూపములేదు. ఏమని దుఃఖించెదవు. ఓ స్నేహితుఁడా! నీకు విరూపములేదు. ఎందుకు శోకించెదవు. ఓ స్నేహితుఁడా! నీకు వయస్సులు (బాలాద్యవస్థలు) లేవు. ఎందుకు దుఃఖించుచున్నావు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుడనై యున్నాను.

కింనామరోదిషి సఖేనచ తే వయాంసి
కింనామరోదిషిసఖేనచతేమనాంసి
కింనామరోదిషిసఖేనతవేన్ద్రియాణి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ ఓ స్నేహితుఁడా! ఎందుకు దుఃఖించెదవు. నీకు వయోవికారములులేవు. ఓ స్నేహితుఁడా! ఏలదుఃఖించెదవు. నీకు మనస్సులులేవు. ఓ స్నేహితుఁడా! నీకింద్రియములు లేవు. ఏలశోకించెదవు, నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

కింనామరోదిషిసఖేనచతేఽస్తికామః
కింనామరోదిషిసఖేనచతేప్రలోభః
కింనామరోదిషిసఖేనచతేవిమోహో
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ ఓ స్నేహితుఁడా! నీకు కామములేదు. ఏల విచారించెదవు. ఓ స్నేహితుఁడా! నీకులోభమున్ను లేదు. ఏలశోకించెదవు. ఓ స్నేహితుఁడా! నీకువిమోహములేదుగదా? ఏల

ఈవిచారము. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

ఐశ్వర్యమిచ్ఛసికధంనచ తేధనాని
ఐశ్వర్యమిచ్ఛసికధంనచ తేహిపత్నీ
ఐశ్వర్యమిచ్ఛసికధంనచ తేమమేతి
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ నీకు ధనములులేవు. ఐశ్వర్యము నేల యిచ్ఛయించెదవు, నీకు పత్నీ ప్రముఖములు లేవుగదా? నీకు ఐశ్వర్యకాంక్షయేల? ఏలనైశ్వర్యము నిచ్ఛయించుచున్నావు. నీకు మమకారములేదు గదా. నేనైతే జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసముసై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

లిఙ్గప్రపంచజనుషీనచ తేనమేచ
నిర్లజ్జమానసమిదంచవిభాతిభిన్నమ్
నిశ్ఛేదభేదరహితంనచ తేనమేచ
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ లింగము, సంసారము, జన్మము, ఇవినీకును, నాకును లేవు. లజ్జలేని యో మనస్సా! ఇది యంతయు భిన్నమైనట్లు కనఁబడుచున్నది. భేదము, నిశ్ఛేదము అనునవి నీకును, నాకును లేవు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనైయున్నాను.

నోవాణుమాత్రమపి తేహివిరాగరూపం
నోవాణుమాత్రమపి తేహిసరాగరూపమ్
నోవాణుమాత్రమపి తేహిసరాగరూపం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ నీకు అణుమాత్రమైనా వైరాగ్య రూపములేదు. నీకు అణుమాత్రమైనా సరాగ (అనురాగ) రూపములేదు. అణుమాత్రమైనా కామము నీకులేదు. నేను జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

ధ్యాతానతేహిహృదయేనచ తేసమాధి
ర్ధ్యానంనతేహిహృదయేనబహిఃప్రదేశం
ధ్యేయంనచేతిహృదయేనహివస్తుకాలో
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ నీకుధ్యానము చేయువాఁడు లేడు. నీహృదయమున ధ్యాన సమాధులులేవు, బహిరంగమందు లేదు, హృదయమునందు ధ్యానము చేయఁదగినది ఏవస్తువును లేదు, కాలము లేదు, నేను మాత్రము జ్ఞానానంద స్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

యత్సారభూతమఖిలంకథితంమయాతే
నత్వంనమేనమహతోనగురుర్నశిష్యః
స్వచ్ఛస్వరూపసహజంపరమార్థతత్త్వం
జ్ఞానామృతంసమరసంగగనోపమోఽహమ్॥

తా॥ అన్నిఁటికంటె సారాంశమయిన యీజ్ఞానము నాచేత నీకు జెప్పంబడునది. నీవులేవు. మహత్స్వరూపమయిన నాకు గురువుగాని, శిష్యుఁడుగాని ఎవఁడును లేఁడు. స్వయంప్రకాశమై, స్వేచ్ఛాసంచారమై, సహజమయిన పరమార్థరూపమొక్కటి యున్నది. అదే నేనై జ్ఞానానందస్వరూపుఁడనై, సమరసమునై, యాకాశతుల్యుఁడనై యున్నాను.

కథమిహపరమార్థంతత్త్వమానందరూపం
కథమిహపరమార్థంనైవమానందరూపమ్
కథమిహపరమార్థంజ్ఞానవిజ్ఞానరూపం
యదిపరమహమేకంవర్తతేవ్యోమరూపమ్॥

తా॥ ఆనందరూపమయిన తత్త్వము ఇచట పరమార్థమేలాగున నగుచున్నది. పరమార్థతత్త్వమేలాగున నానందరూపముకాకయుండును. పరమార్థము వీలాగున నిచట జ్ఞాన విజ్ఞానరూపమగుచున్నది. ఆకాశరూపమయిన నేనొక్కఁడనే అద్వితీయమైన తత్త్వమునై యుంచున్నాను. నేనటులనుండఁగా పైనచెప్పినవన్ని యు నుండవని భావము.

దహనపవనహీనంవిద్ధివిజ్ఞానమేకం
అవనిజలవిహీనంవిద్ధివిజ్ఞానరూపమ్
సమగమనవిహీనంవిద్ధివిజ్ఞానమేకం
గగనమివవిశాలంవిద్ధివిజ్ఞానమేకమ్॥

తా॥ విజ్ఞాన స్వరూపమయిన పరతత్త్వమొక్కటియు అగ్ని వాయువులు లేనిదై యుండునని తెలిసికొనుము. భూమి జలము లేనిదై యొక్కటియే విజ్ఞానరూపమయినదని తెలిసికొనుము. ఎల్లప్పుడు సమానమై, గమన రహితమై (నిశ్చల) విజ్ఞానమొకటియే యున్నదని తెలిసికొనుము. ఆకాశమువలె విశాలమైయుండునది విజ్ఞానమొకటియేయని తెలిసికొనుము.

నశూన్యరూపంనవిశూన్యరూపం నశుద్ధరూపంనవిశుద్ధరూపమ్
రూపంవిరూపంనభవామికించిత్స్వరూపరూపంపరమార్థతత్త్వమ్

తా॥ శూన్యరూపము గాదు. విశూన్యరూపము కాదు. శుద్ధరూపము కాదు. విశుద్ధరూపము కాదు. రూపము కాదు. విరూపము కాదు. పరమార్థతత్త్వము ఏమనఁగా స్వస్వరూపము గలదిగా నేయుండును.

ముంచముంచహిసంసారం త్యాగంముంచహిసర్వథా
త్యాగాత్యాగవిషంశుద్ధ మమృతంసహజంధ్రువమ్॥

తా॥ ఓ మనస్సా! సంసారమును (శీఘ్రముగ) వదలుము. సంసార త్యాగమున సర్వవిధముల చేతను వదలిపెట్టుము. త్యాగాత్యాగములు విషతుల్యములు. పరమతత్త్వము శుద్ధము, ఆనందమయము, సహజము, (కారణము వలనగాక నంతట తానే పుట్టునది. శాశ్వతమునైనది.

ఇతి శ్రీదత్తాత్రేయ విరచితాయామవధూత గీతాయాం
మాత్మ సంవిత్త్యుపదేశో నామ
తృతీయోఽధ్యాయః.

---

శ్రీజగద్గురు విశ్వనాథావధూత పరగుర్వర్పణమస్తు.





శుభమస్తు.

శ్రీజగద్గురు విశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి.

## అయిదవభాగము-అచలము.

ఆంధ్రతాత్పర్యసహిత

## అవధూతగీత.

### అథచతుర్థోఽధ్యాయః.

శ్రీదత్త ఉవాచ.

నావాహనంనైవవిసర్జనంవా పుష్పాణిపత్రాణికథంభవన్తి
ధ్యానానిమన్త్రాణికథంభవన్తి సమాసమంచైవశివార్చనంచ॥

దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ ఆవాహనములేదు. విసర్జనములేదు. పుష్పములు, పత్రములు ఎట్లుగానుండును. ధ్యానములు మంత్రములు ఏలాగున కలుగును. నాయొక్క పరమపూజ సమము, అసమమునైయున్నది.

న కేవలంబన్ధవిబన్ధముక్తో న కేవలంశుద్ధవిశుద్ధముక్తః
న కేవలంయోగవియోగముక్తః స్సవైవిముక్తోగగనోపమోఽహమ్॥

తా॥ నేను కేవలము బంధవిముక్తుఁడను మాత్రముకాదు. నేను శుద్ధ విశుద్ధముల నుండియు ముక్తుఁడనుమాత్రముకాను. యోగ వియోగముక్తుఁడను మాత్రమేకాను. ఇఁక నేమనఁగా విముక్తుఁడై, యాకాశతుల్యుఁడైన పరమాత్మనే నేనైయున్నాను...

నచాస్తిదేహూనచమేవిదేహో
బుద్ధిర్మనోమేనహిచేంద్రియాణి
రాగో విరాగశ్చ కథంవదామి
స్వరూప నిర్వాణ మనామయోఽహమ్॥

తా॥ నాకు దేహములేదు. విదేహములేదు. బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, ఇవి నాకులేవు. రాగమని, విరాగమని యేలాగున చెప్పుదును. నేనుస్వరూపముచేతనే ఆనంద మయుఁడనై, మాయాఽవిద్యాదివాసనావికారము లేనివాఁడనై యున్నాను.

ఉల్లేఖ మాత్రంనహిభిన్నముచ్చై
రుల్లేఖ మాత్రంన తిరోహితంనై
సమాసమంమిత్ర కథంవదామి
స్వరూప నిర్వాణమనామయోహమ్॥

తా॥ రేఖా మాత్రమయినా భేదములేదు. రేఖా మాత్రమైనా తిరోహితమై (మఱుగుపడి) యుండలేదు. సమ, అసమ, అని ఓమిత్రుఁడా! ఏమని చెప్పుదును. నేను స్వరూపముచేతనే ఆనందమయుఁడనై, మాయాఽవిద్యాది వాసనా వికారములు లేనివాఁడనై యున్నాను.

జితేన్ద్రియోఽహంత్వజితేన్ద్రియోవా
నసంయమోమేనియమోనజాతః
జయాజయౌమిత్రకథంవదామి
స్వరూప నిర్వాణమనామయోఽహమ్॥

తా॥ నేను జితేంద్రియుఁడను. లేక అజితేంద్రియుఁడను అయితిని. నాకు నియమములేదు. సంయమము పుట్టలేదు. ఓ మిత్రుఁడా! జయమని, అపజయమని యేలాగున చెప్పుదును. (అనిర్వాచ్య మనిభావము) నేను స్వరూపము చేతనే ఆనందమయుఁడనై, మాయాఽవిద్యాది వాసనా వికారములు లేనివాఁడనై యున్నాను.

అమూర్త మూర్తిర్న చమేకదాచి
దాద్యన్తమధ్యంనచమేకదాచిత్
బలాబలం మిత్రకథంవదామి
స్వరూప నిర్వాణమనామయోఽహమ్॥

తా॥ నాకెప్పుడును మూర్తిలేదు. అమూర్తిలేదు. నాకెప్పుడును ఆది, అంతము, మధ్యము అనునవి యేదియును లేవు. ఓ మిత్రుఁడా! బలము, అబలము అని నేనేలాగున

చెప్పుదును. నేను స్వరూపముచేతనే ఆనందమయుఁడనై, మాయాఽ విద్యాది వాసనా వికారములు లేనివాఁడనై యున్నాను.

స్మృతా మృతం వాపివిషావిషంచ
సంజాయతేతాతనమేకదాచిత్
అశుద్ధ శుద్ధంచ కథంవదామి
స్వరూపనిర్వాణమనామయోఽహమ్॥

తా॥ మృతా మృతములని, విషా విషములనియు, నాకెన్నఁడును కలుగదుసుమీ! నాయనా! అపరిశుద్ధము, శుద్ధము, అనియేలాగున చెప్పుదును, నేను స్వరూపముచేతనే ఆనంద మయుఁడనై, మాయాఽ విద్యాది వాసనా వికారములు లేనివాఁడనై యున్నాను.

స్వప్నః ప్రబోధోనచ యోగముద్రా
నక్తందివావాపినమేకదాచిత్
అతుర్య తుర్యంచ కథంవదామి
స్వరూప నిర్వాణమనామయోఽహమ్॥

తా॥ స్వప్నము, ప్రబోధము (మేలుకొనుట) యోగము ద్రయును లేదు. రాత్రి అని పగలు అని నాకెన్నఁడును లేవు. అతుర్యమని, తుర్యమని, యీసంగతులనే నెట్లుపల్కుదును. నేను స్వరూపముచేతనే ఆనందమయుఁడనై, మాయాఽ విద్యాది వాసనా వికారములు లేనివాఁడనై యున్నాను.

సంవిద్ధిమాంసర్వ విసర్వముక్తం
మాయా విమాయానచమేకదాచిత్
సంధ్యాదికం కర్మ కథంవదామి
స్వరూప నిర్వాణమనామయోఽహమ్॥

తా॥ సర్వవిసర్వముతోలేని వానిగా నన్ను దెలుసుకొనుము. నాకుమాయయు, విమాయయు, ఎన్నఁడును లేవు, సంధ్యాది రూపమయిన కర్మనేనెట్లుగా జెప్పుదును. నేను స్వరూపము చేతనే ఆనందమయుఁడనై, మాయాఽ, విద్యాది వాసనా వికారములులేని వాఁడనై యున్నాను.

సంవిద్ధిమాం సర్వసమాధి యుక్తం
సంవిద్ధిమాంలక్ష్య విలక్ష్యముక్తమ్
యోగంవియోగంచ కథంవదామి
స్వరూప నిర్వాణమనామయోఽహమ్॥



శుభమస్తు.

శ్రీజగద్గురువిశ్వనాథావధూతయేనమః.

# అద్వైత సుధానిధి.



అయిదవభాగము-అచలము.

ఆంధ్ర తాత్పర్య సహిత

## అ వ ధూ త గీ త.



అథపంచమోఽధ్యాయః.

(శ్రీదత్త ఉవాచ)

ఓమితిగదితంగగనసమంతన్న పరాపరసారవిచారఇతి
అవిలాసవిలాసనిరాకరణం కథమక్షరబిన్దుసముచ్చరణమ్॥

తా॥ దత్తాత్రేయుడు జెప్పుచున్నాడు. ఓం అనే బ్రహ్మ స్వరూపమయిన యీయేకాక్షరము ఆకాశతుల్యమయినది. అది పరాపరములయొక్క సారవిచారము కాదని తెలియవలయును. మఱియునది అవిలాస విలాసములను నిరాకరించునదియునై యుండఁగా అక్షర రూపమయిన బిందూచ్చారణమేలాగున నగుచున్నది.

ఇతితత్త్వమసిప్రభృతిశ్రుతిభిః ప్రతిపాదితమాత్మనితత్త్వమసి
త్వముపాధివివర్జితసర్వసమం కిమురోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ ఈలాగున "తత్త్వమసి" మొదలయిన శ్రుతులచేతను నుపదేశింపఁబడి ఆత్మయందు తత్త్వమసియనునది యుపయోగింపఁ బడినది. నీవు ఉపాధిరహితమైన సర్వసమమైన వాఁడవు. సర్వము సమమైయుండఁగా ఎందు నిమిత్తము మనస్సునందు రోదనము చేయుచున్నావు. రోదనము లేదని భావము.

అధఊర్ధ్వవివర్జితసర్వసమం బహిరన్తరవర్జితసర్వసమమ్
యదిచైకవివర్జితసర్వసమం కిమురోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ మీదు, క్రింద, అనునది వర్జితమై సర్వసమమయి యున్నది. అంతరము బాహ్యము, అనునవి లేక సర్వసమమయి యున్నది. విచారింపఁగా ఏకవర్జితమైన సర్వసమమయి యున్నది. మనస్సునందేల చింతించుచున్నావు, ఇది యంతయు సర్వ సమమయినది.

నహికల్పితకల్పవిచారఇతి నహికారణకార్యవిచారఇతి
పదసంధివివర్జితసర్వసమం కిముర్రోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ కల్పిత స్వరూపమయిన విచారమేదియును లేదు. కారణమనియు, కార్యమనియు, నీవిచారమేమియును లేదు. పదములు, సంధి, ఈమొదలైనవి లేని సర్వ సమమై యుండఁగా దేనినిగురించి నీవు ఏలరోదనము చేసెదవు. అంతయు సర్వసమమైయున్నది.

నహిబోధవిబోధసమాధిరితి నహిదేశవిదేశసమాధిరితి
నహికాలవికాలసమాధిరితి కిముర్రోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ బోధఅని, విబోధ, అని, సమాధియని, యివియేవియును లేవు. దేశమని, విదేశమని, యీ నిశ్చయమేమియు లేదు. కాలమనియు, వికాలమనియు, నేదియు నిశ్చయము లేదు. ఎందు నిమిత్తమై యీ సర్వ సమమైన దానినిగూర్చి చింతిల్లెదవు.

నహికుంభనభోనహికుంభఇతి నహిజీవవపుర్నహిజీవఇతి
నహికారణకార్యవిభాగఇతి కిముర్రోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ ఘటాకాశములేదు. ఘటమున్ను లేదు. జీవశరీరములేదు. జీవుఁడును లేడు. కారణమనిగాని, కార్యమనిగాని, యీవిభాగములేవు. సర్వ సమమైన తత్వమునుగూర్చి యేల చింతపడెదవు.

ఇహసర్వనిరంతరమోక్షపదం లఘుదీర్ఘవిచారవిహీనఇతి
నహివర్తులకోణవిభాగఇతి కిముర్రోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ ఇక్కడనే సమస్తమయిన నిరంతర మోక్ష పదముగలదు. లఘువు, దీర్ఘము అనే విచారములేక యున్నదని తెలియుము. వర్తులము (గుండ్రనిది) గను, కోణముగాను నున్నదియని యీ విచారమేమియు లేదు. సర్వ సమమైన దానిని గూర్చియేల శోకించెదవు. శోకింప వద్దని భావము.

ఇహశూన్యవిశూన్యవిహీనఇతి ఇహశుద్ధవిశుద్ధవిహీనఇతి
ఇహసర్వవిసర్వవిహీనఇతి కిముర్రోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ శూన్యము, విశూన్యము, లేనిదైయనియు, శుద్ధము, విశుద్ధము, అనుభావము లేనిదై యనియు, సర్వము, విసర్వము, అనుమాటలులేనిదై యనియు, ఇహలోకమునందే (ప్రస్తుత విద్యమానదశయందే) యుండియుండఁగా సర్వ సమమయిన పరతత్వమును గూర్చి ఏల దుఃఖించెదవు.

నహిభిన్న విభిన్న విచారఇతి బహిరన్తర సంధివిచార ఇతి
అరి మిత్రవివర్జిత సర్వసమం కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ భేధము, అభేదము, అనునవిలేక యుండఁగాను, లోపల అని, సంధియని, విచారము లేకుండఁగాను, శత్రుఁడు, మిత్రములేక సర్వసమమై యుండఁగాను, ఏలశోకిం చెదవు.

నహిశిష్య విశిష్య సరూప ఇతి నచరాచర భేదవిచార ఇతి
ఇహ.సర్వ నిరన్తర మోక్షపదం కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ శిష్యుఁడని, విశిష్యుఁడని, స్వరూపుఁడని, యేదియు లేకుండఁగానున్ను, చరమ అచరము అని, యీ భేదముయొక్క విచారము లేకుండా యుండఁగానున్ను, ఇచటనే సమస్తమై, నిరంతరమైన మోక్షము గలిగి యుండఁగానున్ను, సర్వసమమయిన తత్వము నుద్దేశించి యెందుకు రోదనము చేసెదవు. చేయవద్దని భావము

ననురూపవిరూప విహీన ఇతి నను భిన్న విభిన్న విహీన ఇతి
నను సర్గవిసర్గవిహీన ఇతి కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ ఓయీ! రూపమని, విరూపమని, యేదియును లేక యుండఁగాను, సృష్టిలయ ములనునది లేకయుండఁగాను, భిన్నమని, విభిన్నమనియు యేదియు లేక యుండఁగాను, సర్వ సమమును గూర్చి యేల దుఃఖించెదవు. వద్దని భావము.

నగుణాగుణపాశ నిబన్ధ ఇతి మృతజీవన కర్మ కరోమి కథమ్
ఇతి శుద్ధనిరంజన సర్వ సమం కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ గుణము, అగుణము, బంధము అనునవి లేకుండఁగాను, మృతుఁడై జీవించి యున్న కర్మను నేను యేలాగున చేయుదును. ఈలాగని పరిశుద్ధమై నిరంజనమై సర్వసమ మైన తత్వము గలిగియుండఁగా సర్వసమమును గూర్చి యేల విలపించెదవు.

ఇహభావ విభావ విహీన ఇతి ఇహకామవికామవిహీనఇతి
ఇహబోధ తమంఖిలుమోక్షసమంకి మురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ ఇక్కడనే భావము, విభావము, అనునవికలిగి యుండఁగానున్ను, ఇక్కడనే కామము, వికామము లేక యుండగానున్ను, ఇక్కడనే మిక్కిలి జ్ఞాన రూపమయిన మోక్షముగలిగి యుండగానున్ను, సర్వ సమమైన తత్వమునుగురించి యెందువలనవి లాపము చేయుచున్నావు.

ఇహతత్త్వ నిరన్తర తత్త్వ మితి నహిసంధి విసంధి విహీన ఇతి
యది సర్వ వివర్జిత సర్వ సమంకిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ ఇచ్చటనే తత్త్వము యొక్కయెడతెగని యథార్థత గలిగియుండఁగా, సంధి, విసంధి, అనునవి వదలకయుండఁగా, అదియే సర్వవివర్జితమైన సర్వసమమై యుండఁగా ఎందుకని యీూరక సర్వసమమునుగూర్చి తపించెదవు.

అని కేత కుటీపరివారసమం ఇహసంగవిసంగవిహీనపరమ్
ఇహబోధ విబోధ విహీనపరం కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ ఇల్లు, ఆశ్రమము, గుడిసె, అనుపరివారము లేకుండఁగాను, ఇచ్చటనే సంగవిసంగములు లేక కేవలముగ నుండియు, బోధాబోధలు లేక యుండఁగాను, ఏల యీూలీల సర్వ సమమునుగూర్చి ప్రలాపించెదవు.

అవికార వికార మసత్యమితి అవిలక్షవిలక్షమ సత్యమితి
యది కేవల మాత్మని సత్యమితి కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ అవికారము, వికారము, ఇవి అసత్యములనియును, లజ్జయు, నిర్లజ్జయు, అసత్యమనియును. కేవలము ఆత్మయందే సత్యమనియున్నట్లుగా తెలసియు ఎందు నిమిత్తము సర్వ సమమునుగూర్చి పలవించెదవు.

ఇహ సర్వతమంఖలు జీవ ఇతి ఇహసర్వ నిరన్తర జీవ ఇతి
ఇహ కేవల నిశ్చల జీవ ఇతి కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ జీవుఁడు సర్వత్రయున్న వాఁడని, ఇచట సర్వమందు దృఢము గా వ్యాపించిన వాఁడు జీవుఁడని, ఇచటనే కేవలము నిశ్చలుఁడై జీవుఁడుండఁగా సర్వ సమమును గూర్చి యేల విచారపడి యెదవు.

అవివేక వివేక మబోధ ఇతి అవికల్ప వికల్ప మబోధఇతి
యదిచైక నిరన్తర బోధ ఇతి కిమురోదిషి మానసిసర్వ సమమ్॥

తా॥ అవివేకమనియు, వివేకమనియు, అబోధ అనియు నుండగాను, అవికల్పమని, వికల్పమని, అబోధయనియు నివియుండఁగాను, (వికల్పమనగా సందేహము.) నిరంతరమై వ్యాపించియుండిన బోధకలిగి యుండగాను, సర్వసముని గూర్చి శోకించనేల ?

నహిమోక్ష పదం నహిబన్ధపదంనహి పుణ్యపదంనహిపాపపదమ్
నహి పూర్ణపదం నహిరిక్త పదం కిమురోదిషిమానసిసర్వ సమమ్॥

తా॥ మోక్షపదములేదు. బంధపదము లేదు. పుణ్యస్థానములేదు. పాపస్థానము లేదు. నిండినచోటున్ను లేదు. శూన్యమయిన పదములేదు. సర్వసముని గూర్చి ఏల యీవలవని విచారము.

యదివర్ణ వివర్ణ విహీన సమం యదికారణకార్య విహీనసమమ్
యది భేదవిభేదవిహీన సమం కిమురోదిషి మానసిసర్వసమమ్॥

తా॥ వర్ణము, వివర్ణము లేక సమమైయుండఁగాను, కార్యకారణములు లేక సమమయియుండఁగాను, భేదాభేదములులేక సమమైయుండఁగాను, సర్వసముని గూర్చి వలవని యీదుఃఖమేల ?

ఇహసర్వ నిరన్తర సర్వచితే ఇహ కేవల నిశ్చల సర్వచితే
ద్విపదాది వర్జిత సర్వచితే కిమురోదిషిమానసి సర్వసమమ్॥

తా॥ సర్వమునందు ఎల్లప్పుడు వ్యాపకుఁడైనట్టియు, కేవలము నిశ్చలుఁడై సర్వవ్యాపియయినట్టియు, ద్విపద చతుష్పదాదులు (నరులని పశువులని) విభాగములేక సర్వస్థలములయందును వ్యాపించియున్న సర్వసముఁడు ఇచటనే యుంటూయుండఁగా సర్వసముని విషయమై ఏమని శోకించెదవు.

అతిసర్వ నిరన్తర సర్వగతం రతి నిర్గల నిశ్చల సర్వగతమ్
దినరాత్రి వివర్జిత సర్వగతం కిమురోదిషిమానసి సర్వ సమమ్॥

తా॥ సర్వమును అతిక్రమించ యెల్లప్పుడు సర్వవ్యాపకమై దేనియందు నపేక్షలేక నిశ్చలమై సర్వగతుఁడై, దినము, రాత్రియను విభాగము లేక సర్వగతమై యున్న సర్వసముని గూర్చి యెందుకు దుఃఖించుచున్నావు.

నహిబన్ధవిబన్ధ సమాగమనం నహి యోగవి యోగసమాగమనమ్
నహితర్కవి తర్కసమాగమనంకిమురోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ బంధ విబంధముల సమాగమమును లేకుండఁగాను, యోగ వియోగ సమాగమనము లేకుండఁగాను, ఊహాపోహలు లేక యుండఁగాను, సర్వసమమును గూర్చి ఎందుకు రోదనము చేసెదవు.

ఇహకాల వికాల నిరాకరణ మణుమాత్ర కృశాను నిరాకరణమ్
నహి కేవల సత్య నిరాకరణంకిమురోదిషిమానసి సర్వసమమ్॥

తా॥ ఇచ్చటనే కాలవికాలములను నిరాకరించుచుండఁగాను, అణుమాత్రస్వరూపమయిన అగ్నిని నిరాకరించుచుండఁగాను, (అణుమాత్రమైన అగ్నియనఁగా జఠరాగ్ని-క్షుత్పిపాసలు లేక యుండఁగానని తాత్పర్యము.) కేవల సత్యమును నిరాకరింప కుండగానున్న సర్వసమమును గూర్చి ఏల విచారము.

ఇహ దేహవిదేహవిహీన ఇతినను స్వప్నసుషుప్తి విహీనపరమ్
అభిధాన విధాన విహీన పరంకిముదిరోషిమానసి సర్వ సమమ్॥

తా॥ దేహమనియు, విదేహమనియు, కేవలము లేక యుండఁగాను, స్వప్నము, సుషుప్తియనునవి లేకయుండఁగాను, నామరూపములు లేక యుండఁగాను, సర్వసముని గూర్చి దుఃఖమేల?

గగనోప మశుద్ధ విశాలసమం అవిసర్వవివర్జిత సర్వ సమమ్
గతసార విసార వికార సమం కిమురోదిషి మానసి సర్వ సమమ్॥

తా॥ ఆకాశతుల్యమై, శుద్ధమై, విశాలమైనదియై యుండఁగాను, విసర్వమును విడిచి సర్వసమమై యుండఁగాను, (విసర్వమనఁగా సర్వమునకంటె వ్యతిరిక్తము.) గతసారము (సారము పోయినది.) విసారమ్ము (మొదటనే నిస్సారమయినది.) అను నది లేక సర్వసమమయిన తత్వము గలిగియుండఁగాను, సర్వసముని గూర్చి నీకింకను దుఃఖమేల?

ఇహధర్మవిధర్మవిరాగతరం ఇహవస్తువివస్తువిరాగతరమ్
ఇహకామవికామవిరాగతరం కిమురోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ ధర్మాధర్మములు లేక వైరాగ్యము మాత్రమే యయినట్టియు, వస్తువు, అవస్తువు, అనునవి లేక వైరాగ్యమ్ము గలిగినట్టియు, కామము, వికామమును లేక వైరాగ్యమే స్వరూపమైనట్టియు, నైయున్న సర్వసముని గూర్చి యేలదుఃఖించుచున్నావు.

సుఖదుఃఖవివర్జితసర్వసమ మిహశోకవిశోకవిహీనపరమ్
గురుశిష్యవివర్జిత తత్త్వపరం కిమురోదిషి మానసిసర్వసమమ్॥

తా॥ సుఖదుఃఖములను విడచి నట్టి సర్వసమమైనట్టియు, శోక విశోకములు లేక సర్వోత్తమమైనట్టియు, గురు శిష్యులు లేక తత్వమొకటే యుత్తమమైనదిగా నుండఁగా సర్వసమునిగూర్చి యేల యీవింత దుఃఖము.

సకిలాంకురసారవిసారఇతి నచలాచలసామ్యవిసామ్యమితి
అవిచారవిచార విహీనమితి కిమురోదిషిమానసిసర్వసమమ్॥

తా॥ అంకురమని, సారమని. విసారమని నేదియు లేదుగదా? చలము, అచలము, విసారము అనియు లేదుగదా ? అవిచారమని, విచారమని, శూన్యమనియు, నీ వెఱుఁగుదువు గదా? సర్వసముని కనుఁగొనుటను గురించి యెందుకు విచారపడెదవు?

ఇహసారసముచ్చయ సారమితికథితం నిజభావవిభేదఇతి
విషయేకరణత్వ మసత్యమితి కిమురోదిషి మానసి సర్వసమమ్॥

తా॥ సారము అని, మిక్కిలి సారమనియు నిచ్చట యుండఁగాను, నిజమయిన మనోభావముయొక్క భేదమని చెప్పఁబడినది. విషయమునందు (శబ్దాదులయందని భావము.) సాధనత్వము అసత్యమని యెఱిఁగియుండియు సర్వసముని విషయమునందేలశోకించెదవు. శోకము నీకుఁ గూడదని భావము.

బహుధాశ్రుతయఃప్రవదన్తియతో వియదాదిరిదం మృగతోయసమమ్
యదిచైకనిరన్తర సర్వసమం కిమురోదిషిమానసి సర్వసమమ్॥

తా॥ ఒక వైపున వేదములనేకవిధములుగా ఆకాశాది భూతజాలము. వానివలన గలిగిన యీ ప్రపంచము, అంతయు ఎండమావులలోని నీరువలె నసత్యమైనదని యుద్ఘోషించుచుండఁగా నద్వితీయమై, సర్వమునందు వ్యాపించి, సర్వసమమయిన పరతత్త్వము గలుగఁగా, నీకీశోకమేమిపని?

విన్దతివిన్దతినహినహియత్ర చ్ఛన్దోలక్షణం నహినహితత్ర
సమరసమగ్నోభావితపూతః ప్రలపతితత్త్వంపరమవధూతః॥

తా॥ ఎచ్చటనైతే ఏదానిని తెలిసికొనలేడు, తెలిసికొన లేడో దానియందు వేదాది స్వరూపమయిన త్రైగుణ్యములేదు, (ధర్మార్థకామములనుట) సమరసమునందు మగ్నుఁడైనాని పవిత్రుఁడైన యవధూత యీపరతత్త్వమును ప్రలాపముచేయుచున్నాఁడు.

ఇతి శ్రీదత్తాత్రేయ విరచితాయామవధూత గీతాయాం స్వామి
కార్తిక సంవాదే ఆత్మసంవిత్త్యుపదేశే శమదృష్టికథనం నామ
పంచమోఽధ్యాయః॥

---

శ్రీ జగద్గురువిశ్వనాథావధూతపరగుర్వర్పణమస్తు.





శుభమస్తు.

శ్రీజగద్గురు విశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి.

## అయిదవభాగము-అచలము.

### ఆంధ్రతాత్పర్యసహిత
### అవధూతగీత.

### అథషష్ఠోఽధ్యాయః.

శ్రీదత్త ఉవాచ

బహుధా శ్రుతయః ప్రవదన్తి వయం వియదాదిరిదం మృగతోయసమమ్
యదిచైకనిరన్తరసర్వశివ ముపమేయమథోహ్యుపమా చ కథమ్॥

దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ అనేకవిధములుగా శ్రుతులు చెప్పుచున్నవి. మేము చెప్పుచున్నాము, ఈ పరిదృశ్యమానమైన ప్రపంచమంతయు మృగతృష్ణలయందలి (ఎండమావులు) నీటితో సమానము, ఎక్కడను ఎడములేక సర్వవిధముల వ్యాపించియున్న సర్వశివంకరమైన పరతత్వమున్నట్టయితే దాని కుపమానమనియు, యుపమేయమనియు నెటుల జెప్పఁదగును. ఏవిధమున విమర్శించినను నుపమానోపమేయములు కుదరవని భావము.

అవిభక్తివిభక్తివిహీనపరం ననుకార్యవికార్యవిహీనపరమ్
యదిచైకనిరన్తరసర్వశివం యజనంచ కథం తపనంచ కథమ్॥

తా॥ అవిభక్తమయినదియుగాక, విభక్తమైనదియుగాక, పరమైనట్టియు, కార్యము, వికార్యము, అనునవిలేక యుత్తమమైనట్టియు, నిరంతరము, సర్వమును స్వాధీనమునందుగల తత్వమున్నట్టయితే పూజించుట యేలాగు, తపస్సుచేయుట యేలాగు, దేనికిని వల్లకాదని భావము.

మనఏవనిరన్తరసర్వగతంహ్యవిశాల విశాలవిహీనపరమ్
మనఏవనిరన్తరసర్వశివం మనసాపికథంవచసాచకథమ్॥

తా॥ మనస్సే నిరంతరము సర్వశుభస్వరూపమయినది. మనస్సే యెల్లప్పుడు సర్వగతమయినది. అతిసూక్ష్మత్వ, అతి మహత్వము అనునవియు, మధ్యస్థత్వమునను నవిలేనిదై యున్నది. అట్టి పరతత్వమును చెప్పుట విషయమై మనస్సుచేత నేలాగున జెప్పుదుము. వాక్కుచేత నేలాగున చెప్పుదుము. మనస్సుచేత చెప్పుట యనఁగా తలంచుట యని భావము.

దినరాత్రివిభేదనిరాకరణముదితానుదితస్య నిరాకరణమ్
యదిచైకనిరన్తరసర్వశివం రవిచన్ద్రసమాజ్వలనశ్చకథమ్॥

తా॥ దినము (పగలు) రాత్రి అని భేదమును నిరాకరించునది. అనఁగా "నయత్ర సూర్యోభాతి నచంద్రతారకం" అను శ్రుతి ననుసరించినదనుట. పరమాత్మ నిలచినచోటను సూర్యుఁడులేడు (పగలు లేదనుట.) చంద్రుఁడు, నక్షత్రములులేవు. (రాత్రి లేదనుట.) సూర్యచంద్రులు దివారాత్రములు లేక కాలాతీతమై కాలమునకు లోఁబడనిదని భావము. ఉదయమని, అస్తమయమని, ఉదయించలేదని యీ భావములను నిరాకరించునదియు, ఏకమై, యద్వితీయమై, నిరంతరముగ సర్వశుభములిచ్చు సర్వశక్తుఁడుండఁగా నాయన ముందఱ సూర్యచంద్రులు, అగ్ని అనునవి మిణుగురులకైనా చాలని తేజస్సు గలవారలని తాత్పర్యము.

గతకామవికామవిభేదఇతి గతచేష్టవిచేష్టవిభేదఇతి
యదిచైకనిరన్తరసర్వశివంబహిరన్తరభిన్నమతిశ్చకథమ్॥

తా॥ కామము, వికామము అను భేదములేకుండా గతచేష్టుఁడు, విచేష్టుఁడు, అని భేదములేకుండానున్న, ఏకమై నిరంతరముగ సర్వశుభములనిచ్చునట్టి పరమతత్వము నిల్కడగానుండఁగాను (మనస్సులోననుట) బహిరంగమని, అంతరంగమనియు భేదమెట్లుండును. సర్వవ్యాపకునికి బాహ్యాంతరము లనునవి లేవని భావము.

యదిసారవిసారవిహీనఇతి యదిశూన్యవిశూన్యవిహీనఇతి
యదిచైకనిరన్తరసర్వశివం ప్రథమంచకథంచరమంచకథమ్॥

తా॥ ఇదిసారము, ఇది నిస్సారము అనునట్టి భేదములేకయున్నప్పుడును, శూన్యమని, పూర్ణమని భేదములేకయున్నప్పుడును, నిరంతరము సర్వాత్మస్వరూపము నిండియుండఁగా మొదటిది అనుట యెట్లు. చివరది అనుట యెట్లు. ఆద్యంతములు లేవని భావము.

యదిభేదవిభేదనిరాకరణం యదివేదకవేద్యనిరాకరణమ్
యదిచైకనిరన్తరసర్వశివం తృతీయంచకథం తురీయంచకథమ్॥

తా॥ భేదాభేదములేక యున్నట్టయితేనున్ను, ఇది వేద్యము, ఇతఁడు వేదకుఁడు, అనునట్టి భేదములేక యున్నట్లయితేనున్ను, ఎల్లప్పుఁడెడతెగక యున్న సర్వవ్యాపియైన భగవంతుఁడుండఁగానున్ను, మూఁడవయవస్థయనుటయెట్లు? తురీయావస్థయని యేలాగున చెప్పుదును. మూఁడవయవస్థ సుషుప్తి.

గదితాగదితంనహిసత్యమితి విదితావిదితంనహిసత్యమితి
యదిచైకనిరన్తరసర్వశివం విషయేన్ద్రియబుద్ధిమనాంసికథమ్॥

తా॥ చెప్పఁబడినది, చెప్పఁబడనిదియు ఇదియే అసత్యమైనట్టులయినచోనున్ను, తెలియఁబడినది, తెలియఁబడనిది, అసత్యమైనచోనున్ను, సర్వవ్యాపకమైన సర్వేశ్వరుఁడు నిరంతరంబును గోచరుఁడై గలిగియుండిన పక్షమునను్ను, విషయములు అని, ఇంద్రియములు అని, మనస్సులని యివియెక్కడివి. లేనేలేవని భావము.

గగనంపవనోనహిసత్యమితి ధరణీదహనోనహిసత్యమితి
యదిచైకనిరన్తరసర్వశివం జలదశ్చకథంసలిలంచకథమ్॥

తా॥ ఆకాశము, వాయువు, క్షితి సత్యములుగావనియు, భూమియు, అగ్నియు, సత్యములుగావనియు, సర్వదానిర్భయముగ సర్వాత్ముఁడు సర్వత్రయుండఁగా మేఘమును నదియు, జలమునునదియు, ఎట్టుగానుండును.

యదికల్పితలోకనిరాకరణం యదికల్పితదేవనిరాకరణమ్
యదిచైకనిరన్తరసర్వశివం గుణదోషవిచారమతిశ్చకథమ్॥

తా॥ కల్పితములైన లోకములన్నియు నిరాకరింపఁగా, కల్పితమయిన దేవుఁడు నిరాకరింపఁబడఁగా (మాయచేత కల్పితమని భావము.) "ఏకమేవాద్వితీయం"అను శ్రుతి ప్రకారముగా జగంబంతయు బ్రహ్మభావమును బొందియుండఁగా, గుణములు, దోషములు వీని విచారము ఎట్లు సంభవించును. సర్వమునందు బ్రహ్మత్వ భావము గలవానికే విచారణయు నక్కఱలేదని భావము.

మరణామరణంహినిరాకరణం కరణాకరణంహినిరాకరణమ్
యదిచైకనిరన్తరసర్వశివం గమనాగమనంహికథంవదతి॥

తా॥ మరణము, అమరణము అనునవి నిరాకరించడముగలిగియుండఁగా సాధనము, అసాధనము అనునవి నిరాకరింపఁబడుచుండఁగాను, సర్వశక్తిగల దేవుఁడు సర్వత్రివ్యాపించి సర్వముననిండియుండఁగాను, ఒకచోటికి వెళ్లడము అని, ఒకచోటనుండి రావడము అని అనునవి ఏలాగున చెప్పుచున్నాఁడు.

ప్రకృతింపురుషోనహిభేదఇతి నహికారణకార్యవిభేదఇతి
యదిచైకనిరన్తరసర్వశివం పురుషాపురుషంచకథంవదతి॥

తా॥ ప్రకృతియని, పురుషుఁడని, యీ భేదము లేదనిన్ని, కార్యము, కారణము, అనెడి భేదము లేదనిన్ని, సర్వశక్తిగల పరతత్వము సర్వత్ర నిండియుండెననిన్ని, తెలసియుండఁగా పురుషుఁడని, పురుషుఁడుఁగాడని (స్త్రీయనుట) యెట్లు జెప్పచున్నారు.

తృతీయంనహిదుఃఖసమాగమనం నగుణాద్వితీయస్యసమాగమనమ్
యదిచైకనిరన్తరసర్వశివం స్థవిరశ్చయువాచ శిశుశ్చకథమ్॥

తా॥ మూఁడవది యయిన దుఃఖప్రాప్తిలేదు. రెండవదైన గుణావిర్భావమున్ను లేదు. ఇట్టి సమయమున సర్వత్ర నిండిన సర్వశివుఁడుండఁగా ముసలివాఁడని, పడుచువాఁడని, శిశువని, యీ యవస్థలెట్లు చెప్పదురు.

ననుఆశ్రమవర్ణవిహీనపరం ననుకారణకర్తృవిహీనపరమ్
యదిచైకనిరన్తరసర్వశివమవినష్టవినష్టమతిశ్చకథమ్॥

తా॥ వర్ణములు, ఆశ్రమములు, అనునవి లేనిదై, కారణము, కర్త, అనునవిలేనిదై, సర్వత్రనిండియున్న పరతత్వమొక్కటియై యుండఁగా నష్టము అని, వినష్టము అని, యేలాగున చెప్పఁబడును. (లాభనష్టములు లేవనిభావము.)

గ్రసితాగ్రసితంచవితథ్యమితి జనితాజనితంచ వితథ్యమితి
యదిచైకనిరన్తర సర్వశివమ వినాశి వినాశికథంహిభవేత్॥

తా॥ భక్షించుట, భక్షింపకఁబోవుట అనునవి అసత్యమై యుండఁగా, పుట్టుట, పుట్టకఁబోవుట ఇవి యసత్యములై యుండఁగాను, సర్వవ్యాపియై సర్వేశ్వరుఁడొకఁడే యయియుండఁగాను, ఇది నశించినదని, ఇది నశింపలేదని యేలాగున చెప్పుటగలుగును. కలగదని భావము.

పురుషాపురుషస్యవినష్టమితి వనితావనితస్యవినష్టమితి
యదిచైకనిరన్తరసర్వశివ మవినోదవినోదమతిశ్చకథమ్॥

తా॥ పురుషునికి పురుషత్వము నష్టమైనదని (జన్మవదలినదని యనుట) వినయవంతునికి వినయములు నశించినవనియు, సర్వవ్యాపియైన యీశ్వరుఁడొక్కఁడే సర్వత్ర నిండియున్నాఁడనియు, తెలిసి వినోదమని, అవినోదమని యేలాగున జెప్పదురు.

యదిమోహవిషాదవిహీనపరో యదిసంశయశోకవిహీనపరః
యదిచైకనిరన్తరసర్వశివమహమేతిమమేతికథంచపునః॥

తా॥ మోహము, దుఃఖము, అనునవి లేక యున్నటువంటిన్ని, సంశయము, దుఃఖము లేనివాఁడైయున్నటువంటిన్ని, సర్వవ్యాపియైన సర్వశివుఁడు సర్వత్రయొక్కఁడే నిండియుండఁగానున్ను, అహంకారమనియు, మమకారమనియు, నేలాగున జెప్పగలము.

ననుధర్మవిధర్మవినాశఇతి ననుబన్ధవిబన్ధవినాశఇతి
యదిచైకనిరన్తరసర్వశివమిహాదుఃఖవిదుఃఖమతిశ్చకథమ్॥

తా॥ ధర్మాధర్మములు నశించుననియు, బంధాబంధములు నశించుననియు, పరమాత్మయొక్కఁడే సర్వత్రనిండియుండుననియు దెలిసియుండఁగా దుఃఖము అని, దుఃఖము లేదని, యీబుద్ధి యేలాగున తటస్థమగును. (సుఖదుఃఖద్వంద్వము లేదనుట.)

నహియాజ్ఞికయజ్ఞవిభాగఇతి నహుతాశనవస్తువిభాగఇతి
యదిచైకనిరన్తరసర్వశివంవదకర్మఫలానిభవన్తికథమ్॥

తా॥ యజ్ఞమని, అయజ్ఞమని, విభాగమేమియు లేదనియు, అగ్నియని, యితరవస్తువని, యీ విభాగ మేమియు లేదనియు, తెలిసి సర్వశివుఁడు సర్వదా సర్వత్రవ్యాపించియున్నాఁడని తెలిసియుండఁగాను, కర్మఫలము నేలాగున జెందునో చెప్పుము చూతము.

ననుశోకవిశోకవిముక్తఇతి ననుదర్పవిదర్పవిముక్తఇతి
యదిచైకనిరన్తరసర్వశివం ననురాగవిరాగమతిశ్చకథమ్॥

తా॥ శోకవిముక్తుఁడు, శోకసహితుఁడు, అనునవి లేకయుండఁగా, గర్వయుక్తుఁడు, గర్వసహితుఁడునుగాకయుండగాను, సర్వశక్తుఁడైన సర్వేశ్వరుఁడే తానై యొక్కఁడే నిండియుండఁగాను, రాగము అని, విరాగము అని యెవ్విధమున చెప్పవచ్చును.

నహిమోహవిమోహవికారఇతి నహిలోభవిలోభవికారఇతి
యదిచైకనిరన్తరసర్వశివం హ్యవివేకవివేకమతిశ్చకథమ్॥

తా॥ మోహమని, విమోహమని, యీ భేదములేక యుండఁగా, లోభము, విలోభమునను వికారము లేకయుండఁగాను, సర్వవ్యాపియై, సర్వశక్తిసంపన్నుఁడైన, పరతత్వము వెల్లడియగుచుండఁగా, అవివేకమనియు, వివేకమనియు, నే నేలాగున చెప్పఁదగును. ఈశ్వరసాక్షాత్కారముగలవానికి లోకగుణంబు లేమియు బాధింపవని భావము.

త్వమహం నహిహంత కదాచిదపి కులజాతి విచార మసత్యమితి
అహమేవశివః పరమార్థ ఇతి అభివాదన మత్రకరోమికథమ్॥

తా॥ నీవు అని, నేను అని ఎన్నఁడును లేదు. కులము, జాతియను విచారము అసత్యమైయున్నది. నేనేపరమార్థముగా పరాత్పరుఁడను అయియుండఁగా అభివందనమేలాగున నెవరికి నేను చేయుదునో చెప్పుడు.

గురుశిష్య విచార విశీర్ణఇతి ఉపదేశ విచార విశీర్ణఇతి
అహమేవ శివఃపరమార్థ ఇతి అభివాదన మత్రకరోమికథమ్॥

తా॥ గురువు, శిష్యుఁడు అని విచారణలేక యుండఁగాను, ఉపదేశమనియెడి విచారములేక యుండఁగాను, నేనేపరమార్థమయిన శివుఁడనని తెలిసియుండఁగాను, ఇచ్చట ఎవ్వనికి ఎట్టుగా వందనము చేయుదును.

నహికల్పిత దేహవిభాగ ఇతి నహికల్పితలోక విభాగ ఇతి
అహమేవశివఃపరమార్థ ఇతి అభివాదన మత్రకరోమికథమ్॥

తా॥ మాయా కల్పితమయిన యీదేహ విభాగములేదనియు, మాయా కల్పితమయిన లోక విభాగము లేదనియు, నేనేపరమార్థముగ శివుఁడనని తెలిసి యుండఁగాను, ఇచ్చట నెవ్వరికి నెట్టుగా వందము నొనర్తునో చెప్పుడు.

సరజోవిరజోన కదాచిదపి నను నిర్మల నిశ్చల శుద్ధఇతి
అహమేవశివఃపరమార్థ ఇతి అభివాదన మత్రకరోమికథమ్॥

తా॥ రజోగుణముతోఁ గూడియుండిగాని, విడిచిగాని, యెన్నఁడును నేనుండలేదు. నేను నిర్మలుఁడు, నిత్యుఁడు, శుద్ధుఁడు, నైన పరమపురుషుఁడనే పరమార్థముగానై యుండఁగా నెవ్వనికి నట నెటుల నభివాదన మొనర్తునో తెలియకుండినది.

నహిదేహ విదేహవికల్ప ఇతి అనృతం చరితం నహిసత్యమితి
అహమేవశివఃపరమార్థ ఇతి అభివాదన మత్రకరోమికథమ్॥

తా॥ దేహ విదేహములనెడి వికల్పములేదు. నేను అసత్యమును పలుకలేదు. సత్యమును పలుకలేదు. అనృతమును సత్యముగాఁ జెప్పలేదు. సత్యమునసృతముగాను జెప్పలేదు. నేను పరమార్థమున విచారింపఁగా పరమాత్ముఁడనై, ఎవనికైన నెట్లువందనము చేయువాఁడనో చెప్పుఁడు.

విన్దతి విన్దతి నహినహి యత్ర చ్ఛన్దో లక్షణం నహినహి తత్ర
సమరసమగ్నో భావిత పూతః ప్రలపతితత్త్వం పరమవధూతః॥

తా॥ యెక్కడెక్కడ దేనిదేనిని తెలుసుకొనలేదు. తెలుసుకొనలేడో అక్కడక్కడ వేదాది స్వరూప మేదియును లేదు. సమత్వరసమందు మునిఁగినాని పవిత్రుఁడైన యవధూత ఈలాగని పరతత్త్వమును జెప్పుచు నటించుచున్నాఁడు.

ఇతి శ్రీదత్తాత్రేయ విరచితాయామవధూతగీతాయాం
స్వామికార్తిక సంవాదే స్వాత్మసంవిత్త్యుపదేశే
స్వాత్మనిర్ణయో నామ షష్ఠోఽధ్యాయః.

శ్రీజగద్గురువిశ్వనాథావధూతపరగుర్వర్పణమస్తు.



శుభ మస్తు.

శ్రీ జగద్గురువిశ్వనాథావధూతయేనమః

# అద్వైత సుధానిధి.



అయిదవభాగము-అచలము.

—:0:—

ఆంధ్రతాత్పర్యసహిత

## అవధూత గీత.



అథసప్తమోఽధ్యాయః.

శ్రీదత్తఉవాచ.

రథ్యాకర్పట విరచితకన్థః పుణ్యాపుణ్య వివర్జితపన్థః
శూన్యాగారే తిష్ఠతినగ్నో శుద్ధనిరంజన సమరస మగ్నః॥

తా॥ దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు. రాజమార్గమునం దచ్చటచ్చట పడిపోయిన చింకిరిగుడ్డలచేత గూర్పంబడిన బొంతగలవాఁడై, పుణ్యపాపములను విడచిపెట్టిన మార్గము గలవాఁడై, దిగంబరుఁడై, శూన్యగృహమునందు శుద్ధమై, నిరంజనమయిన, సమమనెడి యానందరసమునందు మునిఁగియుండువాఁడు అవధూత శ్రేష్ఠుఁడని భావము.

లక్ష్యా లక్ష వివర్జితలక్ష్యో యుక్తాయుక్త వివర్జిత దక్షః
కేవల తత్త్వ నిరంజన పూతో వాదవివాదః కథమవధూతః॥

తా॥ లక్షణము, అవలక్షణము, అనువానియందు విడిచిపెట్టఁబడిన లక్ష్యము (గురి) గలవాఁడైనట్టియు, యుక్తము, అయుక్తము, అనువానిని వదలివేయుటయందు సమర్థుఁడైనట్టియు, కేవలపరతత్వ మగుటవలన నిరంజనత్వముచేత పవిత్రుఁడైనట్టి యవధూతయతి, వాదవివాదముల యందెటుల నుండును. లోకముతో నేమియు పనిలేదని భావము.

ఆశాపాశ విబన్ధనముక్తశ్శౌచాచార వివర్జితయుక్తః
ఏవం సర్వవివర్జిత సంతస్తత్త్వంశుద్ధ నిరంజనవన్తః॥

తా॥ ఆశా పాశములను విడిచిపెట్టుటవలన ముక్తుఁడైనట్టియు (ఆశలనఁగా కోరికలు అవే త్రాళ్లవంటివి. ఆశలు గలిగియుండుట త్రాళ్లతో గట్టిపెట్టుట వంటిది. అవి విడిచినతనను కట్టివేసిన త్రాళ్లముడిని విప్పుకొనుట వంటిది. అట్టిముడినుండి విమోచనము నొందువాఁడే ముక్తపురుషుఁడని భావము) శుచిత్వము, అశుచిత్వమని, యీ యాచారమును విడిచిపెట్టుటచేత యోగ్యుఁడైనట్టియు, (ఇట్టివాఁడవధూతయని భావము.) ఈరీతిని సర్వసంగములను వదలిన మహానుభావులు యథార్థముగా కేవలము పరిశుద్ధమయినవారై నిరంజనవంతులగుచున్నారు. అంజన మనఁగా మాయా, అవిద్యాకల్పితమైన ప్రకృతి బంధము. దానిని వదలియున్నవారై జీవన్ముక్తులగుదురు అనిభావము.

కథమిహ దేహ విదేహవిచారః కథమిహ రాగ విరాగ విచారః
నిర్మల నిశ్చల గగనాకారం స్వయమిహ తత్త్వం సహజాకారమ్॥

తా॥ ఇచటను విదేహమని, దేహమని, యీవిచారమెందుకు? (దేహము: శరీరము; విదేహము: జీవుఁడు; ఈరెండునుకూడా పరమార్థమువలన సంభావ వస్తువులే గనుక యీ విచార మక్కరలేదని భావము.) ఇచటను రాగమని, విరాగమని, యీ విచారమెందుకు? (రాగమనఁగా సర్వవస్తువుల యందభిలాష. విరాగమనఁగా సర్వవస్తువులయందు వైరాగ్యము. సర్వమును త్యజించిన వారికి మిథ్యాభూతములయిన వీనితోనేమి ప్రయోజనమని భావము.) తాను నిర్మలమై, నిశ్చలమై యుండుగగన మేలాగుననుండునో ఆలాగున సహజమయిన ఆకారముగలిగిన పరతత్త్వమే అయియున్నాఁడు. కావున నేదియు నక్కరలేదు.

కథమిహ తత్త్వం విన్దతి యత్ర రూపమరూపం కథమిహ తత్ర
గగనాకారః పరమో యత్ర విషయీకరణం కథమిహ తత్ర॥

తా॥ దేనియందు తత్త్వమును నెట్లు తెలుసుకొనుటకు వీలులేదో దానియందు రూపమని, రూపములేదని యేలాగున తెలుసుకొన వచ్చును. రూపముగల ద్రవ్యముగాని, రూపములేని ద్రవ్యముగాని యది కాదు. గగనాకారుఁడైన పరమ పురుషుఁడు యెచ్చట నుండునో యచ్చట సాక్షాత్కారమేలాగున గల్గును. (గగనాకారుఁడనఁగా "గగనార విందం" అనునట్లు ఆకారములేని వాఁడని యర్థము.) సాక్షియైన తానుండఁగా తనకు సాక్ష్యంతర మేలాగున గలుగదని భావము.

గగనాకార నిరన్తర హంసస్తత్త్వ విశుద్ధ నిరంజన హంసః
ఏవం కథమిహ భిన్న విభిన్నం బన్ధవిబన్ధ వికారవిభిన్నమ్॥

తా॥ తత్త్వము వలన విశుద్ధుఁడు, నిరంజనుఁడునునైన పరమహంస (అవధూత) గగన సదృశుఁడై సర్వత్ర బహిరంతరములయందు విశ్వమున నిండియున్న సర్వేశ్వరుఁడై

యుం డెను, ఇవ్విధమున నుండఁగా భిన్న మని (భేదము.) విభిన్న మని (అభేదము.) బంధమని (సంసారము) విబంధమని (మోక్షము) ఈవ్యవస్థ యేలాగున నేర్పడును. (ఏమియు నితర ములేక యీశ్వరుఁడొక్కఁడే యున్నాఁడని భావము.)

కేవలతత్త్వ నిరన్తర సర్వంయోగ వియోగాకథ మిహగర్వమ్
ఏవంపరమ నిరన్తర సర్వం ఏవంకథమిహ సారవిసారమ్॥

తా॥ ఈవిశ్వం బంతయు కేవలము పరతత్వముచేత నంతర్బహిర్భాగముల సర్వవస్తువులయందు తానే యావరింపఁబడి యుండఁగా, ఓయోగవియోగములారా! మీరున్నారని మీకు గర్వమెందుకు? మీయందును పరమాత్మ యున్నాఁడు. (మీయందు మాకేమియు భేదబుద్ధిలేదు.) ఈలాగుననే పరమునిచేత సర్వము నిరంతరముగ నిండియుండఁగా (నిరంతరము అనఁగా సందులేకుండా సర్వత్రయని అర్థము.) సారము, విసారము (బలము, బలహీనము.) అనునవి నికనేలాగున వేఱగును? వేఱుగావని భావము.

కేవల తత్త్వ నిరంజన సర్వం గగనాకార నిరన్తర శుద్ధమ్
ఏవంకథ మిహసంగవిసంగే సత్యంకథ మిహరఙ్గ విరఙ్గమ్॥

తా। కేవలము అద్వితీయమైన పరమేశ్వరునిచే సర్వము నిరంజనమై యుంటున్నవి. గగనాకారమై యంతయు శుద్ధమైయున్నదై యున్నది. ఇదిసత్యము. ఇట్టివిషయములో సంగము అసంగము, అనునవి యెచ్చటివి? (సంగమనఁగా ప్రకృతితో గలసి యుండుట, విసంగమనఁగా కలియక యుండుట.) రంగము, విరంగము, (వినోదము, అవినోదము.) అనునవి సత్యముగా నెక్కడివి? సర్వము సర్వేశ్వరాత్మకమై యుండఁగా నీభేదబుద్ధియెచ్చటిదని భావము.

యోగవియోగై రహితోయోగీ భోగవిభోగై రహితోభోగీ
ఏవంచరతిమన్దంమన్దం మనసా కల్పిత సహజానన్దమ్॥

తా॥ యోగవియోగములులేకనే యోగియైనట్టియు (సంయోగవియోగములనెడి ప్రకృతి సంబంధ ద్వంద్వమును వదలి కేవలపరమాత్మగా నయిన వాఁడనిభావము.) భోగము (ఇంద్రియ సుఖము.) విభోగమనఁగా (ఇంద్రియ దుఃఖము.) ఇవి రెండునులేక భోగియైనట్టియు, (ఇచట భోగమమనది బ్రహ్మానందానుభవము.) ఇట్టి గుణములు గలిగిన పరమహంసుఁడు మనస్సుచేత గల్పింపఁబడిన సహజమయిన ఆనందము గలుగునట్లుగా మందమందముగా (మిక్కిలి మందముగానసుట) సంచరించుచుండును.

బోధవిబోధైస్సతతంయుక్తో ద్వైతాద్వైతంకథమిహముక్తం
సహజో విరజః కథమిహయోగీ శుద్ధనిరంజిన సమరసభోగీ॥

తా॥ బోధవి బోధములతో (జ్ఞానాజ్ఞానములు) నెల్లప్పుడు గూడికొనిన వాఁడైన యోగి, ద్వైతాద్వైతములచేత (భేదాభేదములు) ఏలాగునవిముక్తుఁడగును? (కాఁడనుట) శుద్ధుఁడై, నిరంజనుఁడైన సమరసానుభవముగల యోగియిచ్చట సహజమయిన విరజస్కుఁడైనట్టి (రజస్తమః ప్రభృతులులేని) ఈశ్వరుఁడే లాగున నయియుండును? ఎట్లగునో చెప్పుమని భావము.

భగ్నాభగ్న వివర్జితభగ్నో లగ్నాలగ్నవివర్జితలగ్నః
ఏవంకథ మిహసారవిసారస్స మరసతత్త్వంగగనాకారం॥

తా॥ భగ్నము (నాశనము) అభగ్నము (స్థితి) ఇవిలేక యెల్లప్పుడు భగ్నుఁడైన వాఁడును (అదృశ్యాకారుఁడనుట.) లగ్నము (కలిసియుండుట) అలగ్నము (విడిచియుండుట,) ఇవిరెండును లేనివాఁడయ్యును, లగ్నుఁడైన వాఁడును (జగద్వ్యాపకుఁడనిభావము) సమరసరూపుఁడు నయిన సారాసారములయొక్క విచారణ యేలాగున గలుగుచున్నది? సర్వమయుని విషయమైభిన్న విమర్శయెందుకని భావము.

సతతం సర్వవివర్జితయుక్త స్సర్వంతత్త్వవివర్జితముక్తః
ఏవంకథ మిహజీవితమరణం ధ్యానాధ్యానైః కథమిహకరణమ్॥

తా॥ సర్వమును వదలుటచేత యుక్తుఁడైనట్టియు, సమస్తతత్త్వములచేతను విముక్తుఁడైనట్టియు, (ఇచటతత్త్వములనఁగా ౨౪ తత్త్వములు. వానిని విడచిన వాఁడనుట. జ్ఞానేంద్రియములు ౫ కర్మేంద్రియములు ౫ వీని విషయములు ౧౦ అంతఃకరణములను మనోబుద్ధి చిత్తాహంకారములు ౪ ఈ యిరువదినాల్గు తత్త్వములను మించి తానిరువదియైదవ వాఁడైన నీశ్వరుఁడని యభిప్రాయము.) ఈశ్వరుఁడొక్కఁడే యయియుండఁగా నిచట జీవితమనియు, మరణమనియు, నేలాగున గలుగును? మఱియు ధ్యానముచేయుటచేయకుండుటయనునవి సాధనము లెట్లగును? (కావనిభావము.) జ్ఞానేంద్రియములు త్వక్కు. చక్షువు. శ్రోత్రము. జిహ్వ. ఘ్రాణము. అని అయిదు. వీని విషయములు. స్పర్శము. రూపము. శబ్దము. రసము. గంధము. అనియైదు. కర్మేంద్రియములు. వాక్కు. పాణి. పాదము. పాయు. ఉపస్థలనియైదు. వీనివిషయములు. వచనము. కృత్యము. గమనము. విసర్జనము. ఆనందము. అనియైదు. తక్కినవి చెప్పఁబడి యున్నవి.

ఇన్ద్రజాలమిదంసర్వం యథామరుమరీచికా
అఖణ్డితమనాకారో వర్తతే కేవలశ్శివః॥

తా॥ ఈ పరిదృశ్యమానమయిన జగంబంతయు నింద్రజాలమువంటిది. ఎండమావులలోని నీరువంటిది. గాని సత్యమైనదికాదు, దీనివలన బంధమోక్షములు లేవు; పుణ్యపాపములు, సుఖదుఃఖములు, శీతోష్ణములు, లాభాలాభములు, జయాపజయములు, ఆశానిరాశలు, లోనగుద్వంద్వములు బంధశబ్దవాచ్యములు. ఈశ్వరుఁడొకఁడు. జీవుఁడొకఁడని

భేదము ధూమాదిమార్గము. అర్చిరాదిమార్గము, లింగశరీరము ముక్తి, విరజాస్నానము, ముక్త పురుషులతోఁ జేరుట, ఇత్యాదులు మోక్షపదవాచ్యములు. ఈరెండును లేక యొకయీశ్వరుఁడే యుండుట తక్కిన దంతయు నసత్యము, ఈశ్వరుఁడు సత్యమనుటయు, తానే యీశ్వరుఁడనుటయు, పరమార్థమయిన యీశ్వరుఁడని యెఱుంగుట యొక్కటి నిత్యమని భావము. అఖండితమై, అనాకారమై, కేవల పరతత్వమున్నది.

ధర్మాదౌమోక్షపర్యన్త నరీహాస్సర్వథావయమ్
కథంరాగవిరాగైశ్చ కల్పయన్తివిపశ్చితః॥

తా॥ ధర్మము మొదలు మోక్షపర్యంతము మేము నిస్పృహులము. ఇట్టివారమై యుండఁగా రాగవిరాగములతో నేల మాకుసంబంధమును పండితులు కల్పించుచున్నారో తెలియదు. రాగము (ఆసక్తి) విరాగము (అనాసక్తి) ఇవి మాకు గలుగనేకలుగవని భావము.

విన్దతివిన్దతినహినహియత్ర ఛందోలక్షణంనహినహితత్ర
సమరసమగ్నో భావితపూతః ప్రలపతితత్త్వంపరమవధూతః॥

తా॥ ఎచ్చటెచ్చటను విడియున్నదని తెలుసుకొనుచున్నాఁడో అక్కడ వేదోక్తలక్షణములేదు. లేదు. సమరసమునందు మగ్నుఁడైనాని పవిత్రుఁడైన అవధూత ఈలాగున తత్వమును ప్రలాపముగ సంభాషించుచున్నాఁడు.

ఇతి శ్రీ దత్తాత్రేయ విరచితాయామవధూత గీతాయాం
స్వామికార్తిక సంవాదే స్వాత్మసంవిత్త్యుపదేశే
సప్తమోఽధ్యాయః॥

---

శ్రీజగద్గురువిశ్వనాథావధూతపరగుర్వర్పణమస్తు.





శుభమస్తు.

శ్రీజగద్గురు విశ్వనాథావధూతయేనమః.

# అద్వైతసుధానిధి,

అయిదవభాగము-అచలము.

ఆంధ్రతాత్పర్యసహిత

అవధూతగీత.

అథఅష్టమోఽధ్యాయః.

శ్రీదత్తఉవాచ.

త్వద్యాత్రయావ్యాపకతాహతాతే ధ్యానేనచేతఃపరతాహతాతే
స్తుత్యామయావాక్పరతాహతాక్షేతుమస్వనిత్యంత్రివిధాపరాధాన్॥

తా॥ దత్తాత్రేయుఁడుఁ జెప్పుచున్నాఁడు. ఓపరమదైవా! సర్వేశ్వరా! సర్వవ్యాపకా? సర్వవర్తీ! పరదేవతా! నావిన్నపంబాలింపుము, నీనిమిత్తమై యాత్రచేయుట వలన నీవ్యాపకత్వము గొట్టఁబడినది. నిన్నుగూర్చి ధ్యానము చేయుటచేతను నీయొక్క చిత్తైక్యము గొట్టఁబడినది. నిన్ను నేను స్తోత్రముచేయుట చేతను నీయొక్క వాక్పరత్వము గొట్టఁబడినది. ఇట్టి యపరాధములను నిత్యము మూఁడు విధములుగా జేయుచున్నాను. వీని నన్నిఁటిని క్షమియింపుము.

కామైరహతధీర్దాన్తోమృదుశ్శుచిరకించనః
అనీహోమితభుక్శాన్తస్స్థిరోమచ్ఛరణోమునిః॥

తా॥ ఏకామములచేతను బుద్ధిచలింపనివాఁడు దాంతుఁడు. (అంతరింద్రియనిగ్రహముగలవాఁడనుట,) మృదుస్వభావముగలవాఁడు, పరిశుద్ధుఁడు, తనకేచింతయు లేనివాఁడు, దేనిని గోరనివాఁడు, మితభోజి, వీఁడు శాంతుఁడనఁబడును. (బహిరింద్రియనిగ్రహముగలవాఁడని భావము.) అంతర్బహిరింద్రియ నిగ్రహముగలిగి స్థిరుఁడై నన్ను శరణు నొందినవాఁడే మునియని చెప్పఁబడును. నన్నే పరమేశ్వరునిగా దలంచి శరణుసొంద

వలెనని భావము. పరమార్థమున నొక్కఁడే యయినను ఇంద్రజాలమును నిజమని తెలియకుండుటకు గురు శిష్యన్యాయము గ్రహింపవలయును.

అప్రమత్తో గభీరాత్మా ధృతిమాఞ్జితషడ్గుణః
అమానీమానదఃకల్పో మైత్రఃకారుణికఃకవిః॥

తా॥ ప్రమత్తుఁడుఁగాక గంభీరమయిన మనస్సుగలవాఁడై ధైర్యముగలిగి కామ క్రోధాది షడ్గుణములను జయించి మానాభిమానములు లేక ప్రమాణాతీతుఁడై దయాళుఁడై త్రికాలజ్ఞుఁడైన వాఁడు మిత్రుఁడనుటకుఁ దగినవాఁడు.

కృపాలురకృతద్రోహస్తితిక్షుస్సర్వదేహినామ్
సత్యసారోఽనవద్యాత్మా సమస్సర్వోపకారకః॥

తా॥ సర్వభూతములయందును (జనులలోనగు సర్వజీవకోటియనుట.) దయఁగలవాఁడును, ద్రోహముచేయనివాఁడును, తన కొరులుచేసిన ద్రోహమును క్షమించి సహించియుండువాఁడును, మనస్సున నింద్యకర్మలు లేనివాఁడును, సర్వజనులకు నుపకారము చేయువాఁడును, సముఁడని చెప్పంబడును.

అవధూతలక్షణం వర్ణైర్జ్ఞాతవ్యం భగవత్తమైః
వేదవర్ణార్థతత్త్వజ్ఞైర్వేదవేదాన్తవాదిభిః॥

తా॥ మిక్కిలి పూజనీయులై భగవత్తుల్యులయిన వారిచేత నవధూతలక్షణము తెలుసుకొనఁదగినది. వారు వేదాక్షరములయొక్క యర్థమునందలి తత్త్వమెఱింగినవారుగాను, తత్త్వజ్ఞులును, వేదవేదాంతముల నెల్లప్పుడు వాదించువారును, అయి యుండుదురు వారే అవధూత లక్షణమును జెప్పుటకుఁ దగినవారు.

ఆశాపాశవినిర్ముక్త ఆదిమధ్యాన్తనిర్మలః
ఆనన్దేవర్తతే నిత్యమకారంతస్య లక్షణమ్॥

తా॥ ఆశాపాశములు లేక ఆదియందు, మధ్యయందు, అంతమందును, నిర్మలుఁడై. (ఏకరీతి మనస్సుగలవాఁడైయనుట.) ఎల్లప్పుడానందము నందే ఎవఁడుండునో అతనియొక్క యీ ధర్మము అవధూత పదమునందలి అకారముయొక్క అర్థము.

వాసనా వర్జితాయేనవక్తవ్యంచ నిరామయమ్
వర్తమానేషు వర్తేతవకారంతస్యలక్షణమ్॥

తా॥ ఎవనిచేతను (అనాదికర్మ) వాసన వదలిపెట్టఁబడునో, ఎవ్వఁడానందమునే చెప్పఁదగినదో, ఎవ్వఁడు వర్తమానము లందుండునో, (అనఁగా గతమునకు శోకింపక అనాగతమునకు నాశపడక వర్తమానకాలమునందే కాలమున కేది లభించినను దానితో

